# పురూరవ

నాటకం

చలం



దేశి కవితా మండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
రచన — 1947
పునర్ముద్రణ 1957
వెల : రూపాయిన్నర
దేశీప్రెస్, విజయవాడ.



సంపాదకురాలు:

జొందలపాటి శకుంతలా దేవి

శివరామకృష్ణ.

# పురూరవ

## ఉదయం - హేమంతఋతువు

అడవిని అమిర్చి అందంగా చేసిన ఉద్యానవనం. సహజమైనగొప్ప అందంగల ప్రదేశం. చుట్టూ పర్వతాలు. రాళ్ళని చీల్చుకుంటో, ఎగురుతో, నవ్వుతో, క్రిందికి దొర్లే సెలయేళ్లు. ఆ యేళ్ళతో ఎప్పుడూ నిండుతో వుండే చలవరాతిమెట్ల కోనేరు ఆ వనానికి మధ్య. కోనేరులో తెల్లని నల్లని హంసలు ఠీవిగా రంగు రంగుల పెద్ద తామర పువ్వులమధ్య తిరుగుతూ వున్నాయి. కొండలనిండా అడవినిండా పురాతనమైన నీడలతో మూలిగే పెద్దచెట్లు. ఆ చెట్లని పెనవేసుకొని దట్టంగా చీకట్లుగా అల్లుకున్న బండిగురివిందలాంటి అడవితీగెలు. వింత వింత పరిమళాలతో గుత్తులు గుత్తులుగా, రంగులు రంగులుగా వేళ్ళాడే పువ్వులు.

పక్షుల కోతుల ఉడతల కలరవాలు.

అది పురూరవుడి ప్రత్యేకోద్యానవనం. దాంటోకి ఆతని రాణులకీ, పుత్రులకీ, సేవకులకి కూడా ప్రవేశంలేదు.

సమస్తమూ అనుభవించి కూడా, తనకి అర్థంగాని అశాంతివల్ల, జీవితంమీది ప్రశ్నలతో, అందరాని దానికై అన్వేషణంలో చాల పొద్దు ఆ వనంలో కాలం గడుపుతాడు ఆ మహారాజు.

పురూరవుడు రూపంచేత, పరాక్రమంచేత, ఆత్మౌన్నత్యంవల్ల దేవసమానుడని, ఇతరలోకాలలో కూడా వినుతి కెక్కినవాడు.

చలికాలపు మంచు ఎండలో నుంచుని, దూరంగా ఎదురుగా వున్న పర్వతపాదంలో, చెట్లనీడలమధ్య కదిలే కొత్తకాంతి ఏమిటా అని

నిదానించి చూస్తున్నాడు. ఆ కాంతికి మనిషిరూపం వుండడం, అటూ ఇటూ కదలడం ఆశ్చర్యంతో గమనిస్తున్నాడు.

దేవవేశ్య ఊర్వశి, ఆ నిమిషానికి ముందే మనుష్యరూపాన్ని పొంది ఆ పర్వతపాదం దగ్గిర భూలోకంలోకి జన్మని పొందింది, యవ్వనవతిగా, మనుషులెవరూ స్వప్నాలలోనైనా భావించుకోలేని లావణ్య తేజస్సులతో.

ఇంద్రసభలో పురూరవుడి ప్రశంసరాగా అతని వర్ణనని విని, ఏవో తనకే తెలీని పూర్వ స్మృతులు కలవరపెట్టగా నృత్యంలో పొరబడి, తత్ఫలితంగా ఈ శాపాన్ని అనుభవించాల్సి వొచ్చింది.

ఎండలో, ఎండకన్న మృదువుగా, వెలుగుగా తళతళలాడే ఆమె వొంటిమీద బట్టలులేవు. కాని, బట్టలులేని లోపం మనుష్యుల కళ్ళకికూడా తోచదు. ఆమె గొప్పజుట్టుని దువ్వవలసిన అవసరం గాని సర్దవలసిన అవస్తగాని ఆమెకి పట్టలేదు.

ఊర్వశి వింతగా చుట్టూ చూసింది. అంతగొప్ప అందమూ ఆమెని ఆకర్షించలేక పోయింది. "ఇదే లోకం? ఇట్లావుంది?" అన్నట్లు చూసింది. కాని ఆమెని ఆవరించినది మానుషత్వం. ఎందుచేత చిన్న పిల్లవలె తనలో పొంగే ఉత్సాహాన్ని ఆపుకోలేక గెంతుతోంది. కొంచెం పరిగెత్తి బెదిరే కళ్ళతో ఇటూ అటూ చూసింది. కింది కొండరాతిమీదికి దూకి నవ్వింది.

ప్రతిమవలె నిలబడి పురూరవుడు చూస్తున్నాడు. ఆమె ఆదుకుంటో కోనేరుదగ్గిరకి వొచ్చి నుంచుంది,

తాను కదిలితే, ఆమె బెదిరిపోతుందేమోనన్నట్టు పురూరవుడు ఊపిరి బిగపట్టి నుంచున్నాడు.

ఆమె మెట్లుదిగి నీళ్ళవొంచన వొంగి, తనపాపని చూసుకుని నవ్వుకుంటో మురుసుకుంటోంది.

అవతలి వొడ్డునుంచి నీళ్ళలో ప్రతిఫలించే పురూరవుడి ఆకారం ఆమె కంటపడ్డది.

ముందు ఆశ్చర్యం, తరవాత ఏదో ఆమెకే తెలీని జ్ఞాపకాలు. అంగీకారం. సంతోషం.

నీళ్ళలో ఆమెచూపూ, ఆతనిచూపూ కలుసుకున్నాయి. ఆతనిపాపని తన దగ్గిరికి రమ్మని పిలిచింది, చేతులు జాచింది, నవ్వింది. ముద్దు చేసింది. అతను కదలనన్నా లేదు. మొహంలో మార్పైనా లేదు అతనికి.

ఆ పాపని చేరుకోవాలని నీళ్ళలో వాలింది. భయంతో పురూరవుడు 'ఆ' అన్నాడు.

ఆ నీళ్ళలో సునాయాసంగా తేలుతో తలఎత్తి అతనివంక చూపి నవ్వింది.

తడివొంటితో, జుట్టుతో, అతని దగ్గిరికి పరుగెత్తింది, రెండో వొడ్డున మెట్లమీదనించి ఒక్క గంతేసి.

అతని మొహంకేసి గొప్పతృప్తితో చూస్తో, అతనిముందు నుంచుంది. అతను బొమలుముడిచి చూస్తున్నాడు కదలకండా.

అతని మెడచుట్టూ చేతులువేసి పెదిమలమీద ముద్దు పెట్టుకుంది. అతను కదలలేదు.

అతని రొమ్ముమీద తన తడితలను ఆనించి నిట్టూర్పు విడిచింది.

ఊర్వశి:

వొచ్చావు... చివరికి వొచ్చావు... ఎన్ని యుగాలకి కనపడ్డావు నాకు!

పురూరవుడు:

ఎవరు?

ఊర్వశి :

ఎవరా ? నేను తెలీదా నీకు ? ఇదేమిటి ? నువ్వు కాదా ? అవును. నువ్వే, నాకు ఇంత స్పష్టంగా తెలుస్తోంది.

పురూరవుడు :

ఏమిటి ?

ఊర్వశి :

ఏం లేదు.

అతని స్పర్శలో ఆమె పైమరుస్తోంది. అతని నరాలు ఆమె రక్తాన్ని స్పందిస్తున్నాయి. కాని అతని మనసూ అహంకారమూ అంగీకరించటం లేదు. ఆమెనించి దూరం కావడానికి ప్రయత్నిస్తున్నాడు.

పురూరవుడు:

ఏమిటిది ?

ఊర్వశి:

ప్రియా !

పురూరవుడు :

(కోపంగా) ఎవరు నువ్వు !

ఊర్వశి :

నే నెవరు ? నాకు తెలీదు.

పురూరవుడు:

ఎక్కణ్ణించి వొచ్చావు ?

ఊర్వశి :

అక్కణ్ణించి.

ఆమె పిచ్చిదనుకుంటున్నాడు పురూరవుడు.

ఊర్వశి :

నిరంతరం నాకోసమైన నీ ఆహ్వానం, నీ అన్వేషణ నేను వినలేదనుకుంటున్నావా? రావాలనే యత్నం, కాని చాత కాలేదు. నువ్వు యీ మహా విశ్వంలో యేనక్షత్రాలమధ్య యే లోకాలలో వుంటావో కనుక్కోలేక పోయినాను.

పురూరవుడు:

(నవ్వుతో) నేనేం తెలుసు నీకు?

ఊర్వశి :

నువ్వెవరో నాకు తెలీకపోతే, నువ్వెవరో నీకు తెలీదు.

పురూరవుడు:

నే నెవరు?

ఊర్వశి:

నువ్వే! నువ్వు వొక్కడివే నాకు.

పురూరవుడు:

నే నెట్లా తెలుసు నీకు?

ఊర్వశి :

తెలీడానికి ఎట్లా ఏమిటి? అర్ధంలేకండా మాట్లాడుతున్నావు?

పురూరవుడు :

అంటే... నన్నిదివరకు చూశావా?

ఊర్వశి :

చూడకేం?

పురూరవుడు:

ఎక్కడ?

ఊర్వశి :

జ్ఞాపకం లేదు. కాని ఎప్పుడూ చూశాను. కాని తెలీడానికి చూడడమెందుకు ! చూస్తే ఏం తెలుస్తుంది ? ఎన్నిజన్మల నించి, కలలలోంచి వెతుకుతున్నావు నాకోసం నువ్వు ! నేను తెలీదా నీకు ?

పురూరవుడు :

తెలీదు.

ఊరశ్వి:

పాపం !

పురూరవుడు :

ఎవరు నువ్వు? నీ పేరేమిటి ? ఎట్లా రాగలిగావు ఇక్కడికి ?

ఊర్వశి :

ఏమో ! అవన్నీ ఎందుకు ? వొచ్చాను.

పురూరవుడు :

ఎందుకు వొచ్చావు ?

ఊర్వశి :

నీకోసం.

పురూరవుడు ఏమంటాడు ? ఊర్వశి-దేవత అప్పుడే మానవ లోకంలో జన్మించింది, కనక ఆమెకి కొన్నిసంగతులు సహజంగా తెలుసు. సామాన్యమైనవి చాలా సంగతులు తెలీవు. లోకపరత్వంలో, రాజకీయాలలో, ఆరితేరిన పురూరవుడికి ఆమె లోని సత్యం, సహజత్వం ఎట్లా అర్థమవుతాయి ! తెల్లబోయి చూస్తున్నాడు. కొంత సత్యాన్వేషణ చేసినమనిషి గనక, అతని శృంగార జ్ఞానం ఆమెని నిరాకరించలేక పెనుగులాడుతోంది.

ఊ ర్వ శి:

పోనీ, నేను ఇష్టంగాలేనా నీకు ?

పురూరవుడు:

ఊఁ.

ఊ ర్వ శి :

అందంగాలేనా ?

పురూరవుడు:

చాలా !

ఆమె శరీరపు వన్నెకాదు. ఎక్కడా భూలోకంలో కనపడని వింత వెలుగు ఆకర్షణ పొంగుతోంది. ఆమెలోనించి, పురూరవుడు కల కంటున్నా ననుకుంటున్నాడు.

ఊర్వశి :

మరి నామీద ప్రేమకాదా నీకు ?

మనసుపైన కమ్ముకున్న ఆవృతం. ఐశ్వర్యం, గర్వం, అహంకారం, అధికారం పొరలు అడ్డం అతనికి.

ఊర్వశి :

నేను ఇంకా తెలీజాల ఏళ్ళ ?

పురూరవుడు:

ప్రేమ.

ఊర్వశి :

తెలుస్తుందిలే. నీతో వుండడానికే వొచ్చాను. రా కదలవేం ? ఎందుకు అట్లా దిగులుగా వుంటావు ?

పురూరవుడు దిగులుగా లేడు. కాని ఆమె స్వభావానికి మనుషులే భారంగా, లజ్జగా, భయంగా బతుకుతున్నట్టు కనపడతారు.

ఊర్వశి :

చూడు, మనచుట్టూ ఎంత అందమో, సంతోషమో !
ఎందుకు ఆ అనుమానం, దిగులూ ?

మామూలుగా చుట్టూ కనపడే లోకమే, ఆమె కంటికి
పై పొరలుతొలిగి, గొప్ప చిత్రకారుడి పటంవలె
తన అసలు అందంతో తేజస్సుతో కనిపిస్తుంది.

రా నన్ను కావిలించుకో.
ఎంత గొప్పగా, ఈశ్వరుడివలె, మన్మథుడివలె కనపడతావో!

పురూరవుడిది గొప్ప సౌందర్యం. పైగా ప్రేమవల్లనూ,
ఆమె తీక్ష్ణమైన స్వచ్ఛమైన, దృష్టివల్లనూ, ఇంకా
గొప్ప అందాన్ని పొంది కనపడతాడు ఆమెకి.

ఏమిటీ నల్లని సంశయం నీలో ! నిన్నెవరో శపించారు
గావును, పాపం ! భయపడకు. నేను వొచ్చాను కాదూ !
నన్ను నమ్ము. నీ కింక ఏవ్యాకులమూ రానీను. నేనిస్తాను
కాదూ సువ్వెన్నడూ ఎరగని ఆనందానుభవం! నేను లేకనే,
కనపడకనే, నా కోసమే, ఇట్లా దిగులులో పడిపోయినావు !
ఆమె లావణ్యం అతను ఇముడ్చుకోగలిగిన దానికన్న తీవ్రం, నిర్మలం.

పురూరవుడు:

(కఠినంగా) ఆమాటలు మానెయ్యి. నువ్వెవరో, ఎట్లా
వొచ్చావో చెప్పు.

మామూలు మోహరీతులకి అలవాటైన అతని మనస్సు, ఆమె
నిశ్చల తన్మయత్వాన్ని అనుమానిస్తోంది. వెరపునీ, వంకర్లనీ,
కామాల్నీ, అవసరాల్నీ ఎరగని ప్రేమ అతనికి అర్థంకావటంలేదు.

లేదు. తనని తెలిసి, రాజ్యైశ్వర్యాన్ని పంచుకునే కుటిలమైన ఉద్దేశ్యంతో తనని వంచించే తంత్ర మనుకుంటున్నాడు.

ఊర్వశి :

ఏం చెప్పను? ఎట్లా చెప్పను? ఇంత తెలివి లేనివానికి!

పురూరవుడు:

వెళ్ళు.

ఆమె చప్పున గాయపడి దూరంగా జరిగింది.

ఊర్వశి :

ఏమిటి? నన్ను వెళ్ళమంటున్నావా! ఇదేమిటి? నన్ను నువ్వు వెళ్ళమనడమేమిటి!

పురూరవుడు:

ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా నీకు! తెలుసును. ఈ ఘూర్తత్వం కట్టిపెట్టు. స్త్రీవని ఉబలవని వూరుకుంటున్నాను.

ఊర్వశి :

ఇదేదో దుస్స్వప్నం. ఈమాటలు నిజంగా వింటున్నానా? నీకోసమే యుగాలనించే చేతులు జాస్తున్నాను. నీ కలలలో తెలీలేదా నీకోసమైన నా వాంఛ!

చాలా భ్రమపడుతున్నావు! బలీయమైన అజేయమైన ప్రేమబంధంవల్ల కాకపోతే, ఎందుకు నిన్ను వరిస్తాను.

పురూరవుడు:

ఇంక మాట్లాడకు, వెళ్ళు.

ఊర్వశి :

వెళ్ళనా! నిజమా? పాపం. నేను కనపడక ఎంతఏడుస్తావో!

ఎన్ని జన్మలనించి నాకోసం తపిస్తున్నావో నీకు తెలుసా?
నేను లేనిది నువ్వేమిటి?

పురూరవుడు:

ముందే ఈమాటలూ పన్నాగం ఎవరు నేర్పారు నీకు?
వెళ్ళు, నాకు కోపం తెప్పించకు.

ఆమెని పంపివేయమని నౌకర్లని పిలిచేవాడే పురూరవుడు. కాని ఆమె నగ్నశరీరాన్నిచూపి సంకోచించాడు. ఆమె ఏమీతోచక ఆగింది.

ఊర్వశి:

ఏంలోకమో ఇది? నా మనసులో ఇంత స్పష్టమైన యీ
అనురాగానికీ, ఈ ప్రపంచ రీతులకీ ఇంత వైషమ్యమేమిటి?
ఇంత అంధకారం క్రూరత్వం నిన్నెట్లా ఆవరించాయి.

ఏంచెయ్యడానికీ తోచక, నుంచుంది. ఆమె కళ్ళలోని జాలీ, దిగులూ, ఆమె శరీరంలోంచి అద్భుతమైన తేజోవిలాసం కూడా అతన్ని కదిలించలేక పోయింది.

నిన్ను చూస్తే చాలా జాలివేస్తోంది.

మెల్లిగా వెనక్కి వెడుతోంది అతని వంక చూస్తో. జాలిగా నీళ్ళలో దిగింది. అతనివంక వెనక్కి చూస్తోనే తేలుతోంది. తామరలు ఆమెమీదికి వొంగాయి, రంగు చాపలు ఆమెచుట్టూ మూగాయి. హంసలు ఆమెతో ఈత్తున్నాయి.

అవతల వొడ్డునిచేరి, అతనికోసం చేతులు జాచింది. అతను కదలలేదు. తలవొంచుకుని చెట్లచాటుకి వెళ్ళిపోతోంది.

అప్పటికి అతనికి కొంచెం మెలకువవొచ్చి ముందుకు నడిచాడు. ఆమె కనిపించకుండా వెళ్ళింది

అతను ముందుకు నడవబోయి నీళ్ళలో దిగబడి "రా. రా." అంటున్నాడు.

ఆనాటిరాత్రే. రెండోగంట.

వెన్నెల మంచుతెరలు నెమ్మదిగా ఆకులమీదనుంచి కదులుతున్నాయి. నిద్రపొయ్యే హంసలతో, తామరలతో, ఎగిరిపడే రంగురంగుల చాపలతో, ఆడుకుంటున్నాడు, చంద్రుడు.

వెతికి వెతికి అలిసి కొండ దిగి వొస్తున్నాడు పురూరవుడు. కోనేరులో పడే వాగుచేసిన ఇసకదారలమీద కూచుని, తెల్లగా ప్రవహించే నీళ్ళకేసి చూస్తున్నాడు.

గొప్ప పెన్నిధానాన్ని చేతులారా పోగొట్టుకున్న దౌర్భాగ్యుడైనాడు ఆ మహారాజు ఆ వెన్నెల చలిరాత్రి.

అతని వీపువెనక నేరేడుచెట్టు నీడలోనుంచుని వుంది ఊర్వశి. ఆమె జుట్టులో మిణుగురు పురుగులు ఆడుకుంటున్నాయి. పైచెట్టు ఆకుల సందుల్లోంచి వెన్నెలరేఖ జారి ఆమె రొమ్ముమీద మెరుస్తోంది.

పురూరవుడు:

అబ్బా!!! ...... ఇంక కనపడవా ?

ఆ చంద్రుడికేసి చూశాడు, చలికి కొంచెం వొణికాడు. అడవిలో చప్పుడైనప్పుడల్లా తలెత్తి చూస్తున్నాడు.

ఏపేరన్నా తెలీదు. గట్టిగా పిలుద్దామంటే! ...... ఇంక కనపడవా ?

ఆమాటలకి ఊర్వశి కరిగిపోతోంది.

ఊర్వశి ముందుకు రాబోయి ఆగింది. ఆ సడికి అతను వెనక్కి తిరిగి చూశాడు. మిణుగురుపురుగుల వెలుతురూ, ఆమె రొమ్ము తళతళ మాత్రమే కనిపించాయి.

ఎవరు నువ్వు? ఏమైనావు? ……ఇంక కనపడవా?

నిట్టూర్పువిడిచి, పొరిగి నిద్రపోతున్నాడు. ఊర్వశి నెమ్మదిగా వొచ్చి, మోకరించి అతన్ని ముద్దుపెట్టుకుంది. నిద్రలోనే చేతులు జాచాడు ఆమెకోసం. ఆమె అందలేదు. మొహంమీద జీరాడే ఆమె జుట్టుని తోసేసుకుంటున్నాడు అతను. పెదవివిరిచి జాలిగా చూపింది మనుష్యు లింతేగావునని. ఈసారి అతని రొమ్ముకి రొమ్మునానించి తలని దగ్గిరకు తీసుకుని ముద్దుపెట్టుకుంది. అతను చివాలున లేచికూచున్నాడు. ఆమె వెళ్ళి ఏటినీళ్ళల్లో నుంచుంది. ఆతను మేలుకున్నానా లేదా అని ఆశ్చర్యపడుతున్నాడు.

పురూరవుడు:

నువ్వేనా? నువ్వా?

రా, రా. చలి, ఆనీళ్లు……రా.

ఆమె కదలలేదు. అతనే నీళ్ళదగ్గిరికి నడుస్తున్నాడు. ఆమె అవతలవొడ్డుకి వెడుతోంది. ఆమె తడిసినచోటనల్లా నడుంవరకు చంద్రుడు ముద్దు పెట్టుకుంటున్నాడు ఆమెని.

ఊర్వశి:

ఎవరు నువ్వు? ఏదేశం? నీపేరేమిటి? ఎట్లా వొచ్చా విక్కడికి?

పురూరవుడు నవ్వుతున్నాడు.

మాట్లాడవేం? అక్కడే ఆగు. నాప్రశ్నలకి జవాబుచెప్పి కదులు.

అతను నవ్వుతో నీళ్ళల్లో దిగుతున్నాడు.

ఆగు. నన్ను అందుకోగలవనే నువ్వు! నువ్వు ఆ నీళ్ళని దాటావా నా అనుజ్ఞలేనిది. నేను ఇంక కనపడను నీకు.

పురూరవుడు:

[అధికారంతో] నీ అనాజ్ఞ! నేనెవరినో తెలుసా నీకు?

ఊర్వశి:

నీకు తెలుసా?

పురూరవుడు:

ఏమిటి?

ఊర్వశి:

నువ్వెవరో!

పురూరవుడు:

నేనీ సర్వభూవలయ చక్రాధిపతిని—నీ అనుజ్ఞా నాకు!

ఊర్వశి:

అబ్బో!

పురూరవుడు:

నాఅనుజ్ఞ లేనిది నువ్వీ వనంలోకి రాకూడదు. ఈలోకంలో కాలుమోపే అధికారం నానించి పొందాలి ప్రతివారూ.

ఊర్వశి:

నే నెవరో తెలుసా?

పురూరవుడు:

అదే అడుగుతున్నాను.

ఊర్వశి:

నేనెవరో చెపుతాను. అప్పుడైనా నీవెవరో తెలుస్తుందేమో నీబుద్ధికి.

పురూరవుడు:

ఎవరు నువ్వు?

ఊర్వశి :

నువ్వెవరో మళ్ళీ చెప్పు-అదంతా...

పురూరవుడు:

సర్వభూవలయ ఛత్రాధిపతిని.

ఊర్వశి :

నేను సర్వభూవలయ ఛత్రాధిపతి మాణిక్యవిరాజితమకుట భూషిత పాదారవిందను. నమస్కరించు.

పురూరవుడు:

ఆ! ఆ!

ఊర్వశి :

కాదా ?

పురూరవుడు:

కాదు. ఈశిరస్సును శ్రీవిష్ణు చరణారవిందాలముందు తప్ప ఎక్కడా వొంచలేదు.

ఊర్వశి :

సరే.

వెళ్ళిపోతోంది.

పురూరవుడు:

రా. వెళ్ళకు, నీకోసం ఉదయాన్నించి ప్రతిగుహా, పొదా, లోయా, వెతికాను.

ఊర్వశి :

ఏంగొప్ప ఆ వెతకడం ? ఎవరు వెతకరు నాకోసం ?

పురూరవుడు:

కాని, నేను పురూరవ చక్రవర్తిని.

ఊర్వశి :

ఐతేనేం ?

పురూరవుడు:

నామీద నిలవలేని ప్రేమ అనాన్నావు కద !

ఊర్వశి :

అవును. నీమీద. పురూరవ చక్రవర్తిమీద కాదు.

పురూరవుడు:

ఎందుకు నామీద అంత ప్రేమ నీకు మరి !

ఊర్వశి :

అంతేలే తెలుసునీకు. పుత్తసాధారణపు బుద్ధిహీనుడైన మనిషివి నువ్వు.

పురూరవుడు:

నాకా బుద్ధిహీనత ! నాకు ! నాజ్ఞానం పాండిత్యం ! సర్వ శాస్త్రాలకే, ధర్మాలకే నిర్ణయవిధాతను నేను.

ఊర్వశి :

అదంతా ఏమో ? ప్రేమించగల యోగ్యతే నీకు వుంటే ఇవేళా గొప్పగా మాట్లాడవు. నా ప్రేమని గుర్తించలేని నీ అహంభావం, నన్నుసంశయించిన నీజ్ఞానం (నవ్వుతోంది)

పురూరవుడు:

సరేలే. నువ్వు నాకు కావాలి !

ఊర్వశి :

కావాలి ! ఎవరి కక్కర్లేదు ?

పురూరవుడు:

నాతో హాస్యమా ?

ఊర్వశి :

నిన్ను ఎడమకాలితో తన్ని పోలేక, హాస్యమాడుతున్నాను!
నీమీద నా ప్రేమవల్ల.

పురూరవుడు :

ఏమిటా పొగరు? పో, ఇక్కణ్ణించి.

ఊర్వశి :

వెడితే, వెతుకుతావు వెయ్యేళ్ళు.

పురూరవుడు :

తను పడ్డబాధ జ్ఞాపకం తెచ్చుకొన్నాడు.

అవునులే. నాకు నీమీద ఇష్టమని వొప్పుకుంటున్నానుకదా?

ఊర్వశి :

నాకేదో చాలా ఉపకారం చేస్తున్నట్టు, జాలిపడ్డట్టు అనుకుంటున్నావే!

పురూరవుడు;

కాక! ఇంకేమిటి? నామీద నీకు అంత ప్రేమ కావడం వల్ల...

ఊర్వశి :

నీకు నామీద?

పురూరవుడు:

చెప్పానుకదూ, ఇష్టమని.

ఊర్వశి :

అంతేలే నువ్వు పాపం!

పురూరవుడు:

మరి రా.

ఊర్వశి :

నే నవసరమైతే, నువ్వూరా.

పురూరవుడు నీళ్ళల్లో దిగడానికి సంసిద్ధు డౌతున్నాడు.

ఊర్వశి :

ఉండు. ఆబట్టలూ హారాలూ అన్నీ తీసేసిరా.

పురూరవుడు:

ఎందుకు ?

ఊర్వశి :

నాదగ్గిరికి రావడానికి.

పురూరవుడు:

ఏమిటి ? నన్ను ! పురూరవ చక్ర—

ఊర్వశి :

మరిచిపో, నువ్వేమీ చక్రవర్తి కాదు. అవన్నీ నీ రాజధానిలో.

పురూరవుడు:

నేను బట్టలు తీసెయ్యడ మెందుకు ?

ఊర్వశి:

ఆ బట్టలతో హారాలతో నీ అహంకారాన్నికూడా అక్కడే వొదిలిరా.

పురూరవుడు:

నేను చక్రవర్తిని.

ఊర్వశి :

నాముందు కాదు.

పురూరవుడు :

కాక—

ఊర్వశి :

ఎవరో చెపుతాను. ముందు అవి విప్పి ఇవ్వాలా.

పురూరవుడు :

వీల్లేదు. ఏమిటి నీ అధికారం?

ఊర్వశి :

ఇదుగో విను. నా పాదాలు స్పృశించే అధికారం నీకు కలగాలంటే, నీ అధికారాన్ని చాలా దూరంగా వొదులు నాముందు.

పురూరవుడు :

ఏం పొగరు నీకు? నేను నిన్ను వాంఛించే గౌరవాన్ని పొందడమే నీకో అదృష్టం.

ఊర్వశి :

సరే.

పురూరవుడు:

ఇంక రా.

ఊర్వశి :

పురూరవ చక్రవర్తీ, శలవు.

చెట్ల వెనక మాయమయింది. పురూరవుడు బట్టలు తీసివేసే స్వాతంత్ర్యత పడలేక నుంచున్నాడు. కాని ఆమె వెళ్ళిపోగానే, వనమే, తన హృదయమే శూన్యమయింది.

పురూరవుడు:

రా, రా, రా.

ఎవరూ రాలేదు. ఆలోచించి విధిలేక
తన బట్టలూ, హారాలూ తీసిపెట్టాడు.

ఇంక రా.

చెట్ల వెనకనించి 'సువ్వేరా'.

పురూరవుడు:

నీళ్లు, చలి.

ఊర్వశి వొచ్చింది.

ఊర్వశి :

పురూరవ చక్రవర్తికి, మహాజ్ఞాననిధికి, నీళ్ళు చలి. నాకు చలిలేదు.

పురూరవుడు:

నాకు చలి.

ఊర్వశి :

చలి కానీలే. రా.

పురూరవుడు:

ఎందుకు నామీద నీకంత కసి!

ఊర్వశి :

నీమీద కాదు. నీమీద గొప్ప ప్రేమ. నా కసి నీ అల్పత్వం మీద, అంధత్వం మీద.

నీళ్ళలో వొణుకుతున్నాడు పురూరవుడు. ఊర్వశి జాలిపడుతోంది.

ఊర్వశి :

[చేతులు జాచి ప్రేమగా] రా, నాచేతుల్లో నీ రుధిరం ఎన్నడూ ఎరగని ఉష్ణాన్నిస్తాను.

పురూరవుడు ఏరుదాటి వెళ్ళాడు. సిగ్గువల్ల చెట్లనీడల్లో నడుస్తు న్నాడు. ఊర్వశి దూరముగా వెన్నెలలో నడుస్తోంది.

పురూరవుడు :

ఆగు.

ఊర్వశి :

గొప్ప యుద్ధాలు చెయ్యగలవా ?

పురూరవుడు:

ప్రపంచాన్నంతనీ నా భుజబలంతో జయించి ఏకఛత్రాధి పత్యం వహించాను.

ఊర్వశి :

సరే, నన్నందుకో.

వెనక తొరగా పరిగెత్తాడు నవ్వుతో. కాని ఊర్వశి అందదు.

పురూరవుడు:

నా చాతకాదు. నువ్వు తేలిపోతున్నావు.

ఊర్వశి :

ఎవరు నువ్వు !

పురూరవుడు:

నేను పురూరవ మహీపతిని.

ఊర్వశి :

పురూరవ మహీపతీ, మహాశౌర్యధుర్యా ! పరాక్రమశాలీ, నన్నందుకో.

పురూరవుడు:

నాపై కటాక్షించు.

ఆమె ఒక కొండరాతి నానుకుని నుంచుంది.

ఊర్వశి :

దేవతలు ఎట్లా కటాక్షిస్తారు ?

పురూరవుడు:

ఆరాధిస్తే !

ఆమె ఆ కొండరాతి మీదికి ఎగిరికూచుంది.

ఊర్వశి :

ఆరాధించు.

పురూరవుడు:

ఆరాధించు? ఆరాధించడ మేమిటి ? ఎవరిని?

ఊర్వశి :

నన్ను, సౌందర్య దేవతని, ప్రేమదేవిని- నన్ను.

పురూరవుడు:

ఏమిటి ? నేను ఒకస్త్రీ ముందు——

ఊర్వశి:

స్త్రీ ముందు మోకరించడం నేర్చుకుని నువ్వు ఏం తెలుసుకున్నావు ! ఏం జీవించావు ? నీవింత అల్పుడవని తెలీదు నాకు.

పురూరవుడు నిర్వేరపోయి చూస్తున్నాడు. ఆమె కళ్ళలో గొప్ప సుందర తేజస్సు. ఆవెన్నెల ఛాయల్లోంచే ఆమె వొంటినించి బంగారు కిరణాలు. ఆమె పాదాలు ఎర్రని మృదువైన పద్మ పత్రాలు. ఆమె జుట్టులో మిణుగురుల కాంతి గీతలు. ఆమె పెదవులమీద ప్రపంచ పాలనాధికారం.

మర్నాడు ఉదయం: అప్పుడే తెల్లారుతోంది.

లోకం ఎర్రగావుంది. పర్వతంమీదనించి చెట్లలో పక్షులు మేలుకుని అల్లరి చేస్తున్నాయి. ఏరు రక్తం రంగుతో ప్రవహిస్తోంది. చెట్ల ఆకులమీద పువ్వులమీద మంచు ముగ్గులు.

ఏటి ఇసికలో పడుకుని పురూరవుడు నిద్రపోతున్నాడు. ఊర్వశి అతనిపైన ఆనుకుని ముద్దులతో అతన్ని లేపుతోంది. మేలుకున్న పురూరవుడికి ఆమె ముద్దుపెట్టుకున్నదనితెలీదు.

ఊర్వశి:

ఎప్పటికి కళ్లుతెరిచావు? ఎంతనిద్ర!

పురూరవుడు:

నువ్వా!

ఊర్వశి:

నేను నిన్ను చూస్తున్నాను.

పురూరవుడు:

నిద్ర పోలేదా?

ఊర్వశి:

ఎందుకు నిద్ర? నువ్వు నాతో వుండగా నాకు నిద్రా?

పురూరవుడు:

నిద్రనెరగవా? దేవతవా?

ఊర్వశి:

ఏమో, జ్ఞాపకంలేదు.

పురూరవుడు:

ఎందుకు వొచ్చావు ఈ లోకానికి?

ఊర్వశి :

నిన్ను ప్రేమించడానికి. నువ్వెవరు ?

పురూరవుడు :

నేను పురూ...

ఊర్వశి :

మళ్ళీ అదేమాట !

పురూరవుడు:

ఆమెను గట్టిగా వాత్తుకోబోతాడు. ఆమె తప్పించుకుంది.

నేను నీ చరణారవింద మకరంద మధుపానమత్తుణ్ణి.

ఊర్వశి నవ్వుతోంది.

ఊర్వశి :

రా. లే. పోదాం రా.

పురూరవుడు:

ఎక్కడికి ?

ఊర్వశి :

ఆడుకుందాం.

పురూరవుడు నుంచుని చుట్టూ చూస్తున్నాడు.

ఊర్వశి :

ఏమిటి ?

పురూరవుడు:

బట్టలు. నిన్నరాత్రి విప్పినవి. ఎక్కడ విప్పాను ?

ఊర్వశి :

అవా ? అవి లేవు.

పురూరవుడు:

ఏమైనాయి?

ఊర్వశి:

(నవ్వుతో) లేవు. మరిచిపో.

పురూరవుడు:

ఎట్లా?

ఊర్వశి:

రా.

పురూరవుడు:

ఎట్లా రాను? (సిగ్గుపడుతున్నాడు)

ఊర్వశి:

ఎందుకు నీ వొంటిని చూసి నువ్వు సిగ్గుపడతావు? నీ అందం నీకు తెలీదా?

పురూరవుడు బట్టలకోసం చుట్టూ చూస్తున్నాడు.

పురూరవుడు:

తెలిస్తే...

ఊర్వశి:

మరి కనపడకుండా అందాన్ని ఎందుకు దాచుకుంటావు?

పురూరవుడు:

ఈ లోకంలో అంతే.

ఊర్వశి మనసులో దూరంగా తనశాపం స్ఫురిస్తోంది.

పురూరవుడు:

ఎందుకు నామీద ఇట్లా ఆజ్ఞలు పెడతావు? నేను బట్టలు వేసుకుంటే నేం?

ఊర్వశి :

నిన్ను నువ్వు మరవడానికి.

పురూరవుడు:

ఎందుకు మరవడం?

ఊర్వశి :

నువ్వు నా వాడివి కాక ఇంకేమీ కాకుండా పోవడానికని.

పురూరవుడు:

మరి నా అంతటివాడు చక్రవర్తి, నీ పాదాక్రాంతుడు కావడం నీకు గర్వం కాదా?

ఊర్వశి :

(చిరునవ్వుతో) నీ కర్థం కాదు అప్పుడే. చూడు నేను కాక నీకేమున్నా ముఖ్యమై, నానిగాది ఆలోచించావా. చాలా దురదృష్టవంతుడివి.

పురూరవుడు ఆశ్చర్యంతో చూస్తున్నాడు, సిగ్గుపడడం మరిచి. లేఎండ వొంటిమీద మెరుస్తో, ఎక్కడా లోపంలేని గొప్ప సౌందర్యంతో మిరుమిట్లు గొలుపుతోంది ఆమె.

ఊర్వశి :

నాకన్న నీకు ఐశ్వర్యం, ఆనందం, తృప్తీ, ఇంకేముంది ప్రపంచంలో.

ఆమె తీపి అందమూ, కళ్ళలో వెలుగూ చూసి నమ్రుడై శిరస్సు వొంచుకున్నాడు.

ఇంక నేనే నీకు. నీ జీవితం. నీ కాలం నీ నీతి, నీ ఆత్మ, ఇంక నేనే.

భయంతో చూస్తున్నాడు. ఆమె చాలా దయగా అతన్ని దగ్గిర తీసుకుంది.

భయపడకు. నేను నీరక్షణ దైవాన్ని. నా చేతులకి నిన్ను నీవు అప్పగించుకుంటివా, పైనేకాదు, నీ లోపల్నించి పున స్ఫూర్తిగా నాకు వశ్యుడివైనావా నిస్సంకోచంగా, నీకెన్న టికీ ఏ అపకారమూ జరగదు. అంతేనా ?

ఆతను అంగీకారం చూపాడు.

ఇంక రా!

పచ్చికమీద పువ్వుల్లోంచి, చెట్లకొమ్మల మధ్యనించి, నడుస్తున్నాడు.

పురూరవుడు:

ఎవరో, ఎక్కణ్ణించి వొచ్చావో చెప్పవా ?

ఊర్వశి:

నాకు తెలీదు. నిన్నటికి ముందుసంగతి నాకేమీ తెలీదు. నీకోసం వొచ్చానని తెలుసు.

పురూరవుడు:

నాకోసమని, నేనెవరో తెలీక, నీకెట్లా తెలుసు ?

ఊర్వశి :

నువ్వు వొక్కడే తెలుసును గనక. నాజీవితం ఏమీ జ్ఞాపకం లేదు నీమీద సనాతనమైన వాంఛతప్ప. ఏవో చిన్నచిన్న జ్ఞాపకాలున్నాయి. ఎక్కడో చాలా ఆనందంలో వుండే దాన్ని. నిన్ను చూస్తూవుంటే, నీకు ఆనందమనేది ఎన్నడూ తెలీదనిపిస్తోంది. నేను పూర్వమున్నచోట ఆనందం నిర్వ్యాజంగా సహజంగా వుండేది. చూడు ఈచుట్టూ అందం ఇది ఒక అందమనుకున్నావా ! ఏదో నీడలాగు, మసక తెరలోంచి, చూస్తున్నట్టుగావుంది నాకు.

ఇవి పొగడచెట్లు కాదు. ఇవి ఒకపువ్వులు కాదు, ఈ పరిమళం చాలా తక్కువరకపు - పరిమళం. ఈ సూర్యుడు-యీ తీక్షణత్వం ఈ వెలుగూ- ఇవేమిటో వికృతమనిపిస్తుంది.

నడుస్తో, ఒక శీతాఫలంకోసి, ఇటూ అటూ చూసి తింటోంది.

పురూరవుడు:

(ఆశ్చర్యంతో) ఆకలి ! !

ఊర్వశి :

అంటే ! ! !

పురూరవుడు:

అంటే తినాలని కడుపులో బాధ.

ఊర్వశి :

బాధలేదు, కాని సంతోషానికి తింటున్నాను. నువ్వూ తిను. (తినిపిస్తోంది) తినకపోతే నీకు బాధా ?

పురూరవుడు:

అవును. తిని తీరాలి.

ఊర్వశి :

అవును. పాపం, నిద్రపోవాలి కూడాను.

పురూరవుడు:

ఎంతకాలం నువ్వు నాతో ఇట్లా ... ...

ఊర్వశి :

మాట్లాడకు, రా.

కోనేరుదగ్గిరికి తీసికెళ్ళింది.

ఊర్వశి :

రా.

ఇద్దరూ కోనేరులో తేలుతో ఆడుకుంటున్నారు.

ఊర్వశి మునిగి చాలాసేపటివరకు రాలేదు.

పురూరవుడు:

రా, రా. ఎక్కడ నువ్వు?

ఊర్వశి నవ్వుతో తేలింది.

పురూరవుడు:

ఏమైనావు లోపల?

ఊర్వశి:

చాపలతో ఆడుకుంటున్నాను. నువ్వూ రా.

అతని కంఠాన్ని పట్టుకుని నీళ్ళలోకి లాగి మాయమయింది. ఒక్కనిమిషంలో వగరుస్తో పురూరవుడు పైకివొచ్చాడు, ఊర్వశిని చేత్తో పైకి లాగుతో,

ఊర్వశి:

ఎందుకు వొచ్చేశావు అప్పుడే.

పురూరవుడు:

ఊపిరి ...

ఊర్వశి:

అవును. పాపం, నీకే నీళ్లైతేనా, ఆ అడుగున తెల్లని ఇసిక మీాద, నీళ్ళలోనించి పైకి ఎండకేసి చూస్తో, నువ్వూ నేనూ, క్రీడించేవాళ్ళం కదా! ఊపిరాడకపోతే చచ్చిపోతావు. అవునా!

అవును. ఇదివరకు-అక్కడ నేనుండే లోకంలోకి - క్రొత్త వాళ్ళు వొచ్చేవాళ్ళు-ఎక్కడో చచ్చిపోయినా మనేవాళ్ళు వాళ్ళు.

పురూరవుడు:

ఏడుస్తారా ?

ఊర్వశి :

ఎందుకు ఏడుస్తారు ? చాలా ఆనందంగా వుంటారు !

పురూరవుడు:

ఏం చేస్తొ ?

ఊర్వశి :

ఎందుకు ఏం చెయ్యాడం ?

పురూరవుడు:

అక్కడ ఏ రూపం వాళ్ళకి ? ఇట్లానేనా ?

ఊర్వశి :

జ్ఞాపకం లేదు.

పురూరవుడు:

ఎందుకో ఎట్లానో వొచ్చావు. ఎందుకు వుంటావు ?

ఊర్వశి :

నిజం చెప్పినపుడు నిజం అర్థంకాదా మనుషులకి ?

పురూరవుడు:

ఎన్నాళ్ళు వుంటావు ?

ఊర్వశి :

ఎన్నాళ్లు ? ఎప్పుడు ? ఏం జరుగుతుంది ? ఇట్లా ఆలోచిస్తారు గావును మీరు ? ఎన్నాళ్ళేముంది ? ఎన్నాళ్ళు నీకు నేను కావలిస్తే అన్నాళ్ళు. వత్సరాలు, యుగాలు, కల్పాలు.

పురూరవుడు:

నాకు నువ్వు అక్కర్లేదనేది వుంటుందా ?

ఊర్వశి :

చాలా సులభంగా వుంటుందనుకుంటాను.

పురూరవుడు:

ఎట్లా వుంటుంది? ఎందుకు ఉంటుం దనుకుంటావు?

ఊర్వశి :

నీ స్వభావం చూస్తే.

పురూరవుడు:

నీకెట్లా తెలుస్తుంది, నాకు నీ అవసరం పోయిననాడు?

ఊర్వశి :

నన్ను నువ్వు నిన్న పొమ్మన్నప్పుడు, ఇంకా అంతకు పూర్వం నాకైన నీ అవసరం నాకెట్లా తెలిసింది? అట్లా నే.

పురూరవుడు:

మరి ఎందుకు వెళ్ళావు?

ఊర్వశి :

నీ అవసరాన్ని నువ్వు గుర్తించేట్టు చేసేందుకు. నేను చెప్ప లేదా, నువ్వు ఎవరో నీకు తెలిపేందుకు వొచ్చానని.

పురూరవుడు:

నన్ను నాకు తెలిపేందుకా? అంటే?

ఊర్వశి :

ఇంకా తెలీలేదా? నిన్నటివరకు నువ్వు నిన్నెరుగుదువా?

పురూరవుడు:

(ఆలోచనగా) ఆ.

ఊర్వశి:

ఏం చేశావు ఇన్నేళ్ళు?

పురూరవుడు:

యుద్ధాలు చేశాను. రాజ్యపరిపాలన చేశాను.

ఊర్వశి:

ప్రేమించావా ?

పురూరవుడు:

ఆఁ.

ఊర్వశి:

అంటే నీకింకా ప్రేమకి అర్థం తెలీదన్నమాట!

పురూరవుడు:

ఏమి ?

ఊర్వశి:

ప్రేమించినవాడివి నా ప్రేమని గుర్తించలేకపోయినావా ? ప్రేమవల్ల నీ కేమొచ్చింది ?

పురూరవుడు:

సుఖం.

ఊర్వశి:

ఇంతేనా ? సరకం వొచ్చిందా ? విజ్ఞానం కలిగిందా ?... లేదు... ప్రేమ అంటే నీకేం తెలుసు ! నీదృష్టి ఇంకా ఇంత విశాలం కాకుండా వున్నట్టుంటావా, నిజంగా ప్రేమిస్తే !

పురూరవుడు:

నాకు ప్రేమని బోధిస్తావా ?

ఊర్వశి:

అవును. నాకు నువ్వు చాలాస్పష్టం. నీకు నేను చాలా అస్పష్టం. నీవేవో చేశాను, జ్ఞానం ఆర్జించాను, సుఖం

అనుభవించానంటున్నావా? నీలో ఉన్న అగాధమైన అంత ర్యాలు నీకు నేను అర్థం చెయ్యగలిగిననాడు నీకింతవరకు జీవించనేలేదని నీకు తెలుస్తుంది.

జీవితం ఇంతేనా అనే ప్రశ్న రాలేదా నీకు చాలాసార్లు! సౌఖ్యం, ఆనందం, ప్రేమ, అనేపదాలకి ఎంత అల్పమైన అర్థం ఇస్తున్నావో నీకు తెలుసునా? కాని ఒకమాట జ్ఞాపకం పుంచుకో. నా అవసరం నీకు తగ్గినరోజున ఒక్క-క్షణం నేను నిలవను. (శాపం తన షరతుల్ని జ్ఞప్తికి తీసుకొస్తోంది ఆమెలో) అంటే...నాకన్న ఈ ప్రపంచంలో ఎవరూ, ఏ ధర్మమూ, ఏ ఆసక్తీ అధికం కాకూడదు నీ మనసులో.

పురూరవుడు :

(ఆలోచనగా) ఎట్లా అవుతుంది?

ఊర్వశి :

సరేనా?

పురూరవుడు :

సరే.

ఊర్వశి :

అంతసులభంకాదు ఆ సంగతి. ఈ ప్రేమ చాలా కఠోర రూపాన్ని దాలుస్తుంది.

పురూరవుడు:

(భయంగా) ఎందుకు అట్లాంటి భయంకరమైన నిబంధన?

ఊర్వశి :

మరి ప్రేమ అంటే ఏమనుకున్నావు?

నిన్నటించి నువ్వు వినిపించిన ప్రేమగీతాలు రాయడమూ

పాడడమూ అనుకున్నావా? చెప్పాప్పుగా గడిచిన నీ ప్రేమ కథలు! ప్రేమంటే, ఆశించి స్త్రీని ఆలింగనంలోకి వొస్తే ఏభారం లేకుండా అనుభవించడమనుకున్నావా? కంటికి ఇంపున్న స్త్రీనల్లా, నీ పాన్పుమీదికి రమ్మని ఆహ్వానించడ మనుకున్నావా?

స్త్రీ సౌందర్యం ఎందుకు సృష్టిపడ్డదనుకున్నావు? పురుషుణ్ణి కాల్చి పెంపవొంచి కళ్ళు తెరవడానికి, అతని ఆత్మని అతనికి చూపడానికి, తక్కిన ఆలింగనాలన్నీ సృష్టి జరగడానికి. ఏనాడు నన్ను ఇంకోవిషయంకుండు లోకువ చేస్తావో ఆనాటినించి నేను కనపడను. ఎన్ని తపస్సులు చెయ్యి, ఎంత అన్వేషించు, రోదించు. ఇంక నేను కనపడను. సరేనా?

పురూరవుడు:

సరే.

ఊర్వశి:

రా. నాదగ్గిరిగా రా.

— ... —

# మర్నాడు తెల్లార కట్ట

కోనేరుకి దూరంగా రాజుకి ఒక పెద్ద హాలువుంది. ముందు పెద్ద వరండా. వెనకగోడకి తలుపువుంది. ఆతలుపువెనకనే రాజభటులు వుండేది. ఆ తలుపు ఎప్పుడూ తెరువరు.

ఉషాకాంతిలో, తామరపూలనూ, మబ్బుల్నీ చూస్తో మణిమయ వేదికమీద వరండాముందు కూచునివున్నారు ఒకరినానుకుని వొకరు ఊర్వశీ పురూరవులు తన్మయులై.

తలుపువెనకనించి వైతాళికుల వాయిద్యాలు వినపడుతున్నాయి. ఊర్వశి పాదాలు ఆ వాయిద్యాలకు తాళంవేస్తున్నాయి. కాని ఆ శబ్దాన్ని భరించలేకపోతోంది.

పురూరవుడు:

ఆ వాయిద్యాలు వింటున్నావా ?

ఊర్వశి:

ఊఁ.

పురూరవుడు:

ప్రపంచంలోని మహాప్రవీణుల్ని పిలిపించి ఆవాద్య సమ్మేళనాన్ని ఏర్పరిచాను. బావుందా !

ఊర్వశి:

నా చెవులకి కఠోరం. అగమనం.

పురూరవుడు:

చాలా నొచ్చుకుంటారు.

ఊర్వశి:

చ్చుకోనీ. నువ్వు నొచ్చుకోటం లేదా ?

సంకోచిస్తున్నాడు.

(స్థిరంగా) ఆపించు.

పురూరవుడు:

అవి రాజలాంఛనాలు.

ఊర్వశి :

(దూకుడుగా) భరించలేను ఆపు.

ఆమె అధికారాన్ని భరించలేడు అతను.

పురూరవుడు :

ఆపేస్తారు ఇప్పుడే.

ఊర్వశి :

ఇంక ఒక్కనిమిషం వీల్లేదు. అబ్బా! ఎంత మోటుతనం మీ చెవులకి! వెళ్ళు.

పురూరవుడు :

వెడతాను.

ఊర్వశి :

వెడతావా? నేను వెళ్ళనా?

పురూరవుడు :

నువ్వా?

ఆమె లేస్తోంది. ఆమెనాపి పురూరవుడు అయిష్టంగా వెడుతున్నాడు.
అతని వెనక ఆమె చిరునవ్వుతోంది.
పురూరవుడు వెళ్ళాడు. ఆమె పూర్వజ్ఞానంవల్ల మెల్లిగా కూచునే నృత్యం ప్రారంభించింది.
తిరిగి వాస్తో పురూరవుడు మారంనించిచూశాడు, ఆమె నృత్యాన్ని.
వాయిద్యాలు ఆగాయి. ఆమెకూడా ఆగింది.

(చాలా ఆత్రంతగా) ఆగకు. ఎంతలావణ్యం? ఏదీ!

ఊర్వశి :

తాళం వెయ్యి.

పురూరవుడు:

వాళ్ళని మళ్ళీ ప్రారంభించమంటాను.

ఊర్వశి :

వీల్లేదు.

పురూరవుడు:

మరి ?

ఊర్వశి :

నువ్వు తాళం వెయ్యి.

పురూరవుడు :

నేనా ? స్త్రీ నాట్యానికి... నేను...

అతని అభిమానం, పురుషగౌరవం పనిచేస్తోంది, బలహీనంగా.

ఊర్వశి :

(నవ్వుతో) నీ ఆజ్ఞ ననుసరించి నేను నాట్యం చెయ్యాలి. నువ్వుమాత్రం...

పురూరవుడు :

ఆజ్ఞకాదు ప్రార్థన.

ఊర్వశి :

నేనూ ప్రార్థిస్తున్నాను నిన్ను.

పురూరవుడు:

కాని... ఎట్లానూ వీల్లేదు. ఎట్లా ?

ఊర్వశి :

ఆ గంటమీద తాళం వెయ్యి.

పురూరవుడు వైటి భటుల్ని పిలవడానికి ఉపయోగించే జేగంటని చూపుతోంది. అతనూ ఆసంగతి మరిచి ఆగంటని మోగిస్తున్నాడు. తలుపు ఆవతల అరుపులు.

ప్రభూ, ప్రభూ, ఏమాజ్ఞ అని, అరుపులు. పురూరవుడు తన తప్పును గ్రహించి గంటని వొదిలాడు.

ఊర్వశి నవ్వుతోంది.

ఊర్వశి :

వాళ్ళనడిగి మృదంగం తీసుకురా.

పురూరవుడు :

తీసుకుని ...

ఊర్వశి :

వాయించు.

పురూరవుడు :

నేనా ?

ఊర్వశి :

ఏం చేతకాదా ?

పురూరవుడు :

నాకు చేతకాని విద్యవుందా ?

ఊర్వశి :

ఇంకేం ?

పురూరవుడు :

నేనా ?

ఊర్వశి :

నువ్వెవరు ?

పురూరవుడు:

నేను పురూరవ ... కాదు ... నీ

ఊర్వశి :

మరి కానీ.

పురూరవుడు వెళ్ళాడు, మృదంగంతో ప్రవేశించాడు. అతనికి బట్టలు లేవు. కాని తను బైటవాళ్ళకి కనపడపలసిన అవసరంలేదు, అతనికి.

పురూరవుడు:

వాళ్ళ ఆశ్చర్యానికి మేరలేదు.

మృదంగం వాయిస్తున్నాడు. ఊర్వశి నృత్యంచేస్తోంది. తటాలున ఆతని మీదపడి, మృదంగాన్ని దూరంగా పారేసింది.

పురూరవుడు:

బాగా లేదా ?

ఊర్వశి :

నీకు తెలీటం లేదా ?

పురూరవుడు:

అవును. నీ పాదచలనాన్ని అందుకోలేకపోయినాను. ఈ వాయిద్య విక్షేపణలో నన్ను మించినవారు లోకంలో లేరు తెలుసునా నీకు ?

ఊర్వశి :

కావొచ్చు. చాలా పండితుణ్ణి అనుకున్నావు ఇన్నేళ్ళూ. అవునా ?

పురూరవుడు:

అవును.

ఊర్వశి :

ఈనా డేమనుకుంటున్నావు ?

పురూరవుడు:

వొద్దు.

చాలాసిగ్గు పడుతున్నాడు.

ఊర్వశి :

నీ సిగ్గునుచూసి ఆగుతాను. ఇప్పుడేకాదు మాటల్లోనూ, శృగార ప్రకటనలోనూకూడా అంత అందమైన, అపురూప మైన, అప్రమేయానందంలో సిగ్గుపడే దౌర్భాగ్యం ఎందుకు అంతలోతుగా పట్టిందో !

ఈలోపల పొద్దెక్కింది, బైట నాగస్వరం, భజన, జయజయధ్వానాలు

ఊర్వశి :

ఏమిటది ?

పురూరవుడు:

ఈవాళ శుక్రవారం కాబోలు-దేవతా ప్రసాదం తెచ్చారు.

ఊర్వశి :

తెచ్చి ?

పురూరవుడు:

నాకిస్తారు.

ఊర్వశి :

ఎవరు ?

పురూరవుడు:

పూజార్లు

ఊర్వశి :

ఇస్తే ?

పురూరవుడు:

నేను స్వీకరించాలి.

ఊర్వశి :

ఎందుకు ?

పురూరవుడు:

ఎందుకేమిటి ? సరేకాని, నువ్వా వనంలోకి వెళ్లు.

ఊర్వశి:
(రోషంతో) ఎందుకు? (పురూరవుడు జంకుతున్నాడు)

పురూరవుడు:
వాళ్ళు లోపలికి వొస్తారు.

ఊర్వశి:
రమ్మనూ...

పురూరవుడు:
నిన్ను... ఇట్లా... వస్త్రంలేక...

ఊర్వశి:
చూడనీ.

పురూరవుడికి ఏమనాలో తెలీక ఆగాడు.

ఊర్వశి:
ఎవరికోసం ఆ సంకోచం? నీకోసమా, వాళ్ళకోసమా, నాకోసమా?

పురూరవుడు:
అన్నీ.

ఊర్వశి:
నేను వెళ్ళను. వాళ్ళు రాకూడకపోతే, పొమ్మను.

పురూరవుడు:
నేను వెడతాను.

ఊర్వశి:
నీకు బట్టలు!

పురూరవుడు:
అవును. (నవ్వుతో) మరిచి పోయినాను.
ఏం చెయ్యను? ఎక్కడ వున్నాయి?

ఊర్వశి :

ఎందుకులే. వాళ్ళని లోపలికి రానీకు. అక్కణ్ణించే అందుకో. కాని ఇంక ముందు వాళ్ళని రావొద్దను.

పురూరవుడు:

ఎందుకు ?

ఊర్వశి :

ఏమాత్రమూ మనోచలనాన్ని భరించను. ఎందుకు వాళ్ళు! పొమ్మను.

పురూరవుడు పెళ్ళి, పళ్ళూ, పువ్వులూ,
గంధమూ, అక్షతలూ తీసుకొచ్చాడు.

ఊర్వశి :

ఏం చేస్తావు వాటిని ?

పురూరవుడు భక్తితో కళ్ళకద్దుకుంటున్నాడు.

పురూరవుడు:

నువ్వూ తీసుకో

ఊర్వశి :

ఎందుకట్లా ?

పురూరవుడు:

శ్రీ మహావిష్ణు ఆరాధనా ప్రసాదం.

ఊర్వశి :

అయితే ?

పురూరవుడు:

దేవతా ప్రీత్యర్థం.

ఊర్వశి :

ఎందుకు దేవతల ప్రీతి నీకు. ఆ శ్రీ మహావిష్ణు అనుగ్రహం?

పురూరవుడు:

నా రాజ్య క్షేమంకోసం. నా ఐశ్వర్య క్షేమంకోసం.

ఊర్వశి :

అవన్నీ పోతేనేం?

పురూరవుడు:

(ఆశ్చర్యంగా) పోయి...

ఊర్వశి :

(వెక్కిరింపుగా) పోయి? పోయి? పోతేనేం మునిగిపోయింది? ఎన్నడూ ఆలోచించరనుకుంటాను విజ్ఞానవంతులుకూడా? పోతేనేం? నేను లేనూ?

పురూరవుడు:

ఇప్పుడు, ఇదివరకంతానో...

ఊర్వశి :

ఇంక మానెయ్యి.

పురూరవుడు:

ఏమిటి?

ఊర్వశి :

దేవతానుగ్రహ యాచన.

పురూరవుడు:

నువ్వైనా దేవతానుగ్రహం కాదా నాకు?

ఊర్వశి :

సరే - నేను వెడతాను. దేవతల్ని ప్రార్థించు నాకోసం. అనుగ్రహిస్తారు.

పురూరవుడు:

కాదు. అది కాదు.

ఊర్వశి:

నేనెవరి అనుగ్రహం?

పురూరవుడు:

నీ అనుగ్రహం.

ఊర్వశి:

నా అనుగ్రహం అవ్యాజం. నా ప్రియుడు! నా ముందేగాని ఏ దేవతలముందూ శిరస్సును వొంచడానికి వీల్లేదు.

పురూరవుడు:

కాని...

ఊర్వశి:

ఏమిటి, కాని?

పురూరవుడు:

నారాజ్యమే పోతే?

ఊర్వశి:

పోతే...

పురూరవుడు:

ఇంక నామీద ప్రేమవుంటుందా నీకు?

ఊర్వశి:

అందుకనే చెప్పాను. ప్రేమఅంటే నీకు ఓనమాలు రావని.

పురూరవుడు:

నిజమా?

ఊర్వశి:
నువ్వు ఎవరో నాకేం తెలుసు? నాకేంకావాలి? రాజ్యం పోతే! ఐశ్వర్యంపోతే! అట్లాపోదాం.
(ఆలోచిస్తూ) ఈ ఆకలివల్లగావును ఇన్ని భయాలు, దేవతల ముందు ఇన్ని దేబిరింపులు.

పురూరవుడు:
అంతే కాదు. రోగం. మృత్యువు.

ఊర్వశి:
ఏ దేవతలన్నా మృత్యువునించి తప్పించగలిగారా?

పురూరవుడు:
లేదు.

ఊర్వశి:
రానీ రోగం. రోగగ్రస్తుడవైతేనేం గాక, నాకన్న నీరోగం నీకు ముఖ్యం కానన్నాళ్ళు.... ...

పురూరవుడు:
ఈ మాటలన్నీ నిజమా? నన్నెరగని అన్యురాలివి, నిజమా ఈ మాటలన్నీ.... ...

ఊర్వశి:
అబద్ధాల కలవాటుపడ్డ మనసులకి నిజం అర్థంకాదు. నన్ను నీకిచ్చింది ఎవరు? దేవతలా? ఎందుకిచ్చారు నీకు?

పురూరవుడు:
నా పూర్వజన్మ సుకృత కార్యాలవల్ల.

ఊర్వశి:
ఇంక ఒకరిచ్చేదేముంది? అవును. నీ సుకృతం నీకిచ్చింది నన్ను. సుకృతమంటే కార్యాలు కాదు. ఎంతకీ ధర్మ

కార్యాలూ, భుజదర్పం — వీటిసంగతేగాని, నావంటి లావణ్యం నీకువొచ్చి తీరవలసిన నీలోని శృంగారౌన్నత్యం నీకు కనపడదు.

పురూరవుడు:

ఏం? నా అధికారంవల్ల నీ లావణ్యాన్ని బంధించుకోలేనా? అప్పుడు నువ్వేమౌతావు నాకు కాక!

ఊర్వశి :

కాని నన్ను బంధించి నువ్వేమౌతావు?

పురూరవుడు :

అంటే...

ఊర్వశి:

అంతేలే. రా, పోదాం. ఆడుకుందాం.

——•••——

## మధ్యాహ్నం, కొండమధ్య జలపాతం

దానిమీద మర్రిచెట్టు నీడ, ఆనీడలో ఊర్వశి కూచుంది.
ఆమె తొడమీద తల పెట్టుకుని పురూరవుడు.

ఊర్వశి :

ఇంకా చెప్పు మీలోకం సంగతులు.

పురూరవుడు:

నవ్వుతున్నావు మా జీవిత పద్ధతుల్ని చూసి.

ఊర్వశి :

నవ్వకేం చెయ్యను? పాపం! అంత ఇరుకులో ఎందుకు బతుకున్నారా అని ఆశ్చర్యం.

పురూరవుడు:

మీ లోకంసంగతులు వింటే, ఈ హద్దులూ, అభ్యంతరాలూ లేకపోతే, ఆ స్వేచ్ఛావిశాలత్వంలో ఏం ఆనందం వుంటుందాఅని నా సందేహం. కాని నీమాటలూ, వర్ణనలూ విని అందుకోవాలని ఆలోచిస్తాను.

ఊర్వశి :

పోనీ, అక్కడ ఆనందం చాలా ఉన్నతం, విశాలమని నమ్మకం కలుగుతోందా?

పురూరవుడు :

నిన్ను చూస్తే.

ఊర్వశి :

నన్ను చూస్తేనా? నువ్వు నాలోచూసే అందం నా అందమనుకుంటున్నావా? నీచేతుల్లోకి రావడంకోసం, నీకళ్ళ

నన్ను చూడగలగడంకోసం నాకు తొడిగినరూపంగా తోస్తుంది ఇది. నాకు స్పష్టంగా తెలుసు, నువ్వు చూసే ఈ ఆకారంనించి నేను వేరని. నా అసలు నిజమైన తేజస్సుని నువ్వు చూడగలిగితేనా!

పురూరవుడు:

నాకింక వొద్దు. ఇది చాలు నాకు,

చప్పున ఆమె తొడమీదనించిలేచి ఆమెని తన చేతుల్లోకి తీసుకున్నాడు. అతని పురుషత్వం అనివార్యంగా విజృంభించింది. అతనికి తెలీకుండానే అతని చేతుల్లోంచి జారి పక్కన నుంచుంది. అతను చివాలున లేచి పౌరుషంతో ఆమెని కావలించుకుని కిందికి లాగాలని చూస్తాడు సులభంగా. ఆమె దూరమౌతోంది. అతని ఆలింగనంలోకి వశ్యురాలు కాదు. పురూరవుడు రోషంతో ఖిన్నుడౌతాడు.

పురూరవుడు:

అన్యాయం. (తలవొంచుకున్నాడు)

ఊర్వశి:

(దగ్గిరిగా చేరి నవ్వుతూ) ఏమిటి అన్యాయం!

పురూరవుడు:

నన్నీవిధంగా బాధించడం.

ఊర్వశి:

రా నా వెంట.

కొండ నెక్కుతున్నారు.

ఊర్వశి:

నిన్ను బాధిస్తున్నానా? నీ కామం తీర్చలేదనేనా? తొందర పడకు మరి!

పురూరవుడు:

ఎన్నాళ్ళు? సఫలంకాని కోర్కె విషమిస్తుంది.

ఊర్వశి :

నామీదకాదు. పాపం, అదొక్కటేగావును నీకు సౌందర్యాన్నించి ఆనందం తీసుకునే విధం.

పురూరవుడు :

నీకుమాత్రం...

ఊర్వశి :

నీతోవున్న ప్రతినిమిషం నీనించి గొప్పగొప్ప తృప్తి ననుభవిస్తున్నాను.

పురూరవుడు :

అంతకన్న వాంఛలేదా?

ఊర్వశి :

లేదు.

పురూరవుడు :

తెలీదా?

ఊర్వశి :

తెలుసు. కాని ఆ సౌఖ్యం చాలా స్వల్పవిషయం.

పురూరవుడు :

(ఆశ్చర్యంగా) స్వల్పమా? అంతకన్న ఇంకేముంది?

ఊర్వశి :

నీకు తెలీదు. పాపం!

దిగులుగా ఆగాడు.

ఊర్వశి :

రావోయ్ ! దిగులు పడకు. నీకు నా సమస్తమూ అర్పించి, ప్రేమించడానికే వొచ్చాను.

పురూరవుడు:

(ఆగక) మరి —

ఊర్వశి :

సరేలే. రా.

పురూరవుడు:

నువ్వు నడుస్తోవుంటే ప్రతి అడుగుకీ ఆగి, ఆ నిమిషపుఅందం చూస్తో నిలవా లనిపిస్తుంది. మనుషులశరీరానికీ నీశరీరానికీ నేను అందుకోలేని భేదముంది.

ఊర్వశి :

అవును.

పురూరవుడు:

మా శరీరాలు స్థూలం. నీశరీరం ఎప్పుడూ కదిలే నీటిమీాది వెలుగు ఛాయులమల్లే మారుతున్నట్టు కనిపిస్తుంది. ఇందాక నాట్యంచేస్తున్నావా, అప్పుడు ఆవెలుతురే కదులుతోందో నీ సుందరశరీరం కదులుతోందో నిర్ణయించలేకపోయినాయి వాకళ్ళు. నీకదిలికతోనువ్వు సూర్యకిరణాల్ని హారాలకిందా బహుభూషణాలకిందా మార్చి అలంకరించుకున్నావు. కదిలే నీ స్తనాలచుట్టూ మూాగి, నిలవలేకజారి సూర్యకాంతులు సుడిగుండాలు తిరిగాయి.

ఊర్వశి :

చూాడు.

ఆ కొండరాళ్ళమీద అవలీలగా దాటుతో కొన్ని భంగిమలు చూపుతోంది.

పురూరవుడు:

నీపాదఘాతాలకి నేల వాణికి బద్ధలై కొత్తగడ్డిలో రంగు పువ్వుల్ని ఎగరచిమ్ముతోంది. పర్వతాల బీటలు బారిన సందుల్లోంచి సెలయేళ్ళు విముక్తిపడి దూకుతున్నాయి. నవ్వుతో నీచేతులవూపుకి గాలిలో మబ్బులు సుడిగుండాలు తిరిగి మృదువైన కొత్త ఆకారాల్ని దాలుస్తున్నాయి, వూగే నీదేహంతో వొరుసుకుని సూర్యకాంతి ఎన్నడూ ఎరగని తేజస్సుని ప్రకాశింపచేస్తోంది.

నాపాదాలుచేసే ధ్వనులనించి కాలం కొత్తగతుల్ని నేర్చుకుంటోంది. నువ్వుకదిలితే చాలు ఆకాశంలోంచి దివ్యవీణా రవాలు, మృదంగ వాయిద్యాలు వింటున్నట్టుగా వుంది. వుండు ఇంక భరించలేను.

పురూరవుడు ఆమెని తన చేతుల్లోకి ఎత్తుకుని కొండశిఖరం పైకి వెడుతున్నాడు. అతని చేతుల్లో ఆమె నవ్వుతోంది.

పురూరవుడు:

ఈ నిమిషం ఇంత చనువు. నా చేతులో బొమ్మవి. మాట్లాడావా రాజరాజేశ్వరివి.

ఊర్వశి:

నీచూపులో, ఉనికిలో ఇంత స్థిరత్వం వుందిగనకనే- ఉండు- దించునన్ను-చెపుతాను విను. వుందిగనకనే నీకు త్వరలో విసుకు గలుగుతుంది సౌందర్యం; (అలోకం సంగతులు జ్ఞాపకం తెచ్చుకుంటోంది.) అక్కడ దేనికీ స్థిరత్వంలేదు. ఇంద్రియచలనం చాలా విశాలం. ఇక్కడ మళ్లే చూడడం,

వినడం, తినడం జీవితానికి అనవసరం. ఆనందంకోసం జరుగుతాయి అవి. అంతేకాదు కల్పనకీ, వాస్తవానికీ ఇక్కడవున్నట్టు అంతభేదం వుండదు. లోకాల్ని, అనువైన ఇష్టమైన పరిస్థితుల్ని కల్పించుకోగలం.

పురూరవుడు:

మరి బైట నిజంగా మారతాయా? కల్పనా?

ఊర్వశి:

ఇక్కడమాత్రం నిజంగా మారుతున్నాయనుకుంటున్నావా?

పురూరవుడు:

అంటే?

ఊర్వశి:

అర్థంకాదులే. వొదిలెయ్యి. ఇట్లా కూచో.

పురాతనవృక్షంకింద రాతిమీద కూచున్నారు. నాలుగునిమషాలు నిశ్శబ్దం.

ఊర్వశి:

ఏమిటా యోచన? యోచనఅంత నిష్ఫలం ఏమీలేదు.

పురూరవుడు:

స్పష్టంగా చెప్పరాదూ?

ఊర్వశి:

ఎప్పటికీ నువ్వు గ్రహించలేనిదేమిటంటే, ఇంకోరుచెప్పడం వల్ల ఎన్నడూ అర్థంకాదని. క్రమంగా కాలంలో స్వంత అనుభవం బోధించవలిసిందే. మాటలతో నేర్చుకునే విష యాలు చాలా అల్పమైనవన్నమాట.

ఎదుగు విశాలంగా, తెలుస్తాయి. తెలీడమంటే అర్థమేమి టనుకున్నావు. అనుభవించే అర్హత కలగడమన్నమాట.

అనుభవంతో తప్ప వికాసంలేదనే సూత్రమే లేకపోతే, యీ ప్రపంచమే అనవసరం.

ఆ అనుభవాన్వేషణే మీలోకంలో భేదానికి అసలు కారణం. ఆగోలపోనీ,

రా. నేనే నీలోకం. నేనే నీ అన్వేషణ. నేనే నీ అనుభవం. నానించే నీకు సమస్త సృష్టిరహస్యాలూ బోధపడతాయి. రా. నాచేతుల్లోకి రా.

పురూరవు ఆమె రొమ్ముమీద తలనానించి ఆమెచేతుల్లో వాలిగాడు ఆమె అతని మొహంకేసి చూస్తోంది. అట్లా ఆగిపోయినారు. చెట్లఆకుల్లో తేనెపిట్టల యీలలు. పాదాలదగ్గిర గడ్డిపూలు. వాటిల్లో రాలిన పొగడపువ్వుల పరిమళం. ఆ కొండలమీద నించి కనపడే కాసారం, పువ్వుల్లో గడ్డిలో మెరిసే ఎండ, చల్లనిగాలి. పైన నీలంఆకాశంలో తెల్లని మబ్బులు.

పురూరవుడు :

ఆమబ్బు నీ రొమ్ములమీద నీడల్ని కల్పిస్తోంది, ఆకాశం ప్రతిఫలించి నీకళ్లు నాలోపలి చీకట్లని వెలిగించి, ఏవో దివ్యమైన లోకానుభవాల్ని కదిలిస్తున్నాయి.

ఓహో, ఇప్పుడే నాజీవితం ప్రారంభమౌతున్నట్టుంది. ఇంత ఆనందాన్ని ఎట్లా భరించను?

ఊర్వశి :

మాలోకంలో ప్రేమలీల అనంతం. మీకు మల్లే తృప్తి వుండదు. ఇక్కడ వుండికూడా ఆ మబ్బుల్లో పడుకుని తేలిపోగలం. నాకు నీమీద ప్రేమ అనాదిగా కలిగి వెంబ

డించి నన్ను నీ చేతుల్లోకి తీసుకురావడమనేది, నీవెంత గొప్పకర్మచేసి, ఉన్నతుడవై అర్హతసంపాయించావో నను కుంటాను.

అపూర్వమైన అదృష్టాలవల్ల మనుషులకికూడా ప్రతియుగం దేవతానుగ్రహం ఎదో వోరూపాన తటస్థిస్తో వుంటుంది.

పురూరవుడు:

నాకింక కదలాలనిలేదు. ఏవీ నీచేతులు! నీ మధురమైన వూపిరి నా చంపలమీద. ఇక్కడే ఇట్లా ఈక్షణమే అనంతంగా నిలిచిపోలేమా?

ఊర్వశి :

నేను నిలవగలను. వాంఛతప్ప నువ్వు నిలవలేవు.

పురూరవుడు :

ఎందుకు?

ఊర్వశి :

మనుషత్వం. మీలోకలో రసం చాలా తక్కువ. ఆకాస్త రసాస్వాదమూ కాగానే, విముఖులౌతారుగావును రసికులైన వాళ్ళుకూడా.

కాని ఎందుకా దిగులు? నీజీవితమంతా - నేనున్నంత కాలమూ ప్రతిక్షణమూ, ఇంతకన్న శృంగారానుభవాలతో నిండిపోతోవుంటే, ఎందుకూ ఈ ఆలింగనంలోనే నిలకడ? రా. నామీదికి ఇంకా జరుగు. నన్ను ఇట్లా దగ్గిరచేర్చుకోడంతో, నువ్వే నీ అతీంద్రియాలతో ఇంత పరవశుడివైతే, నిన్ను ప్రేమించే నేను ఎంత విశాలంగా, ఎంత

తేజోవంతంగా స్త్రీప్రేమని అనుభవించగలుగుతున్నానో యోచించు.

రా. నాలోకి రా. ఏం సందేహించకు. నీమామూలు మర్యాదలు సిగ్గులు అభ్యంతరాలు వొదిలెయ్యి.

ఇట్లో నాపైకి రా.

ఆ రాతిమీదనే ఆతనితో వొరిగిపోతోంది.

ఆతను చప్పున ఆమెనంతా తీసుకున్నాడు.

వుండు. ఇందువల్లనే యింతమూర్ఖం మీలో. ఇంత అసంతృప్తి. విను. చూడు. నేర్చుకో. రసికావతంసా, పురూరవ చక్రవర్తీ! శృంగారంలో మొదటిపాఠాలు నేర్చుకో.

కాలం గడిచింది.

సూర్యుడు గొప్పగా పర్వతాల వెనకాల అస్తమిస్తున్నాడు ఎర్రని మబ్బుల్లో. మబ్బులఅంచులు ఎర్రగా మంటలమల్లే జ్వలిస్తున్నాయి. కింద జలపాతమంతా రక్తమయమై చిందులు తొక్కుతోంది. పైన చెట్టుమీదచిలుకలూ, తేనెపిట్టలూ శాంతంగా ధ్వనిస్తున్నాయి. పురూరవుడు ఊర్వశి వక్షంమీద తలపెట్టుకుని పడుకునివున్నాడు.,

ఊర్వశి :

(దయగా) తృప్తిఅయిందా?

పురూరవుడు :

(కృతజ్ఞతతో) జన్మకి

ఊర్వశి :

మీామనుషుల్లో శృంగారవిద్యలోకూడా ప్రవీణుడివికాదా నువ్వు!

పురూరవుడు:

(సిగ్గుగా) ఊఁ. కాని నీ ముందు——

ఊర్వశి :

చెప్పు. సిగ్గుపడతా వెందుకు ?

పురూరవుడు:

చాలా నేర్చుకున్నాను

ఊర్వశి :

నేనూను.

పురూరవుడు :

నువ్వు ! ! !

ఊర్వశి :

అవును. మీలోకం సంగతి చాలా విదితమయింది.

పురూరవుడు :

అంతేనా ?

ఊర్వశి :

అంటే ?

పురూరవుడు :

నావల్ల నీకేమీ సౌఖ్యం కలగలేదా ?

ఊర్వశి :

ప్రత్యేకంగా ఇప్పుడు చాలా స్వల్పం. మీజీవితాల్లో ఇదే గొప్ప అనుభవమనుకుంటాను.

పురూరవుడు:

నిస్సందేహంగా!

ఊర్వశి:

పాపం అందుకనే అంతదిగులుగా బతుకుతారు. ఈఆనందంలో కూడా నిలవలేరు చాలాకాలం. అవునా!

పురూరవుడు :

అవును. ముందంతా కోర్కె- ఈ అనుభవం కోసం-తరవాత తృప్తి, చాలా త్వరలో యీ ఆనందమూ రాదు.

ఊర్వశి :

అట్లా శాంతంగా నిలిచి అనుభవించగల స్తిమితమూ నేర్పూ లేదు. మీ తీవ్రత మిమ్మల్ని పర్యవసానానికి తరుముతుంది, చూడు. ఆ చివరి నిమిషం ఎంత నిరామయంగా సౌఖ్యశిఖ రాన్నందుకున్నట్లుంది. నీకు అల్లాంటి అనుభవం మాకు చాలా సాధారణం, మాకా మానుభవం అక్కడప్రారంభించి, నీవు ఆలోచించుకొనలేవు. ఇంక విశ్రాంతీ అంతమూ అవ. సరం లేకండా నిలుస్తాము గొప్ప తీవ్రతలో...యీ ప్రపంచ రూపమే మారిపోతుంది ఆ ఆవేశంలో. ఒక్క రెండు శరీ రాలు కాదు, యీ సృష్టే సృష్టితో మేళవిస్తుంది. కోట్ల కొలదిజీవుల సంయోగానందం నీవొక్కడిలో అనుభవిస్తున్నా వనుకో...

పురూరవుడు:

(ఆత్రుతగా) ఎట్లా లభ్యమౌతుంది నాకు? నీలో...నీ సౌంద ర్యంలో...

ఊర్వశి :

అవును. కాని సౌందర్యానికీ ఆ కలయికకీ సంబంధమేమిటి? అది కామబలం, సృష్టి శక్తి, చేతుల్లోకి తీసుకుని, అదిమి,

తాగి, కళ్ళు ఆవేశంతో, రక్తవిజృంభణతో మనస్సు పొరలుకప్పి- ఆ నిమిషాన సౌందర్యంతో ప్రసక్తి ఏముంది? సౌందర్యాన్నే అనుభవించడం నేర్చుకున్ననాడు స్వర్గమే నీ కరతలామలకం.

పురూరవుడు:

ఎట్లా నేర్చుకోగలను?

ఊర్వశి :

అదో విద్య కాదోయ్. ఎదగాలి ఆ జ్ఞానంలోకి!

పురూరవుడు:

ఎప్పుడు? మృత్యువు తరవాతా? ఆ లోకంలోనా!

ఊర్వశి :

మృత్యు వేమిస్తుంది? అర్హత రావాలి.
రా. ఇంకా విశ్రాంతి కావాలా?

పురూరవుడు:

అక్కర్లేదు, కాని ... ఇట్లారా ... మళ్ళీ ... ఈసారి జ్ఞానంతో..

ఊర్వశి నవ్వుతో అతని దగ్గిరికి పడుకుంది.

అంతేకాదు. ఈ శరీరాల కలయికతో, రక్తసంబంధంతో, నాశక్తి, నా జ్ఞానం, నాస్పష్టత నీలోకి రావాలి. పుత్రకామ వాంఛ తీర్చుకోడమనుకోకు. నీ ఆలింగనం లోకి అపురూప దేహలావణ్యాన్నే కాదు; గొప్ప సంస్కారాన్ని, విశాల విజ్ఞానాన్ని, ఆధ్యాత్మిక శక్తిని తీసుకుంటున్నావు. నీ ఆత్మ వికసించలేకపోతే, యీ సృష్టి లీల అర్థవిహీనం, వ్యర్థం.

ఊర్వశి :

రా. ఇంక.

పురూరవుడు:

ఎక్కడికి? వుండు.

ఊర్వశి :

ఇంకా విశ్రాంతి కావాలా?

పురూరవుడు:

కాదు. ఇట్లారా... ఇంకోసారి మళ్ళీ ఈసారి జ్ఞానంతో కళ్లు తెరిచి.

ఊర్వశి :

(నవ్వుతో) తక్కినమాటలు అను. సిగ్గెందుకు ఇంకా?

ఊర్వశి నవ్వుతో అతని దగ్గిరిగా పడుకుంది, అతను ఆమె మొహం వంక దీక్షగా చూస్తున్నాడు, మోచేతిమీద తన తలని ఆనించి.

వెళ్ళిపోయే కాంతిని చాలాఅయిష్టంగా చేతులు వొదిలింది చీకటి. ఆత్రతతో లోకంమీద తొంగి చూస్తున్నాయి నక్షత్రాలు. సోమరిగా చెట్లపై నిద్రకి పడుకున్న పిట్టల్ని పలకరించుకుంటో తిరుగుతోంది గాలి. తన అర్థాన్ని రహస్యాన్ని కొండ చీకట్లకి విదితం చేస్తోంది రాత్రి. కిందగా కనపడున్న కాసారం ఉదయించే అంగారకుడికి స్వాగత మిస్తోంది.

పురూరవుడు:

నాకు నువ్వెవరో నీకు నేనెట్లా చెప్పను? అన్నీ అనుభవించి ఇంతే ఇంకేం లేదని గోడపెట్టుకుని, అలసతతో కళ్ళుమూసు

కున్న నన్ను లేపి ఆకాశపథానికి ఎత్తి, క్రొత్త విశాలత్వానికి కాంతినిచ్చావు.

అనాదిగా నేను కంటున్న వెర్రి కలలకి అర్థమిచ్చి, యీ జీవితంలోనే నాకు దివ్య ద్వారాలు తెరిచి, క్రొత్త ఆశతో, ఉత్సాహంతో, అందంతో నాకు పునర్జన్మ నిచ్చావు.

జీవితానుభవం అనంతం. నిరంతర సుందర ప్రయాణం. ఎప్పుడూ చివరఅనేది లేని ఆనందానుభవం అని కళ్ళు విప్పావు.

నాకోసం నీఉన్నత ధామాలు విడిచివొచ్చి, నీతో స్వర్గరహస్యాన్నే కిందికి తెచ్చి, నాలోనించి భూమికీ, ఆకాశానికీ నే నెక్కడానికై నీ లావణ్య ఇంద్రధనస్సును కట్టావు.

నువ్వుకాక నాకీశ్వరు డెవరు!

—...—

కాలంగడిచింది - ఏళ్ళుకాని - దినాలేకాని - భేదం లేదు.

రాత్రి మూడుగంటలు. వసంతఋతువు. పౌర్ణమి. కాసారంలో పడవ. పడవలో మహల్ పరుపుల దిళ్ళమధ్య నిద్రబోతో పురూరవుడు, అతనిమీదికి వొరిగి వూర్వశి. ఆమెమెడనిండా వేసుకున్న పుష్పమాలలు అతనికీ ఆమెకీ మధ్య నలుగుతున్నాయి. ఆ పుష్పాల మధ్యనించి, అతనికి వొత్తుకుని వుండడంవల్ల వుబికిన ఆమె స్తనలు చంద్రబింబంకన్న గొప్పగా ప్రకాశిస్తోంది.

పడవచుట్టూ రంగురంగుల కలువలు. వీళ్ళలో మెల్లిగా గాలికి వూగుతోంది నావ.

అనిమిషలు అతనివంక చూస్తోంది ఊర్వశి. మెల్లిగా మబ్బుల్లో కదులుతున్నాడు చంద్రుడు. అదొక్కటే కాలం కదలిక ఆ వనంలో.

అప్పుడప్పుడు ఒకహంస మేలుకుని రెక్కలాడిస్తోంది. ఆ పూవుకి కలువలు కదలి పరిమళ్ళాన్ని వెదచల్లుతున్నాయి వాళ్ళమీద.... అప్పుడప్పుడు నిద్రలో గొప్ప ఆనందంతో చిరునవ్వు నవ్వుతున్నాడు పురూరవుడు.

కళ్లు తెరవకకండానే ఆమెని ముఖంమీదికి తీసుకుని, వక్షాన్ని తన మొహానికి అద్దుకుంటాడు. చేతుల్ని మెల్లిగా తాకి తనచుట్టూ తీసుకున్నాడు.

ఊర్వశి :

(రహస్యంలాగు) ఏం కలలు కంటున్నావు ?

పురూరవుడు:

ఊఁ. ఊఁ. ఎవరు నువ్వు? నీపేరేమిటి ? ఏమని పిలవను నిన్ను?

నిద్రిపోతున్నాడు.

ఊర్వశి :

(రహస్యంగా) అడగకు. ప్రశ్నించకు. తీసుకో, ఆనందించు. నేనున్నాను. అదిచాలు నీకు. నిద్రపో.

అతని కళ్ళమీద, మూతిమీద చాలా తేలికగా ముద్దుపెట్టుకుంటోంది. అట్లా పడవ నీళ్ళలో తేలుతోంది వాళ్ళతో. అతను సుందరస్వప్నాలలో తేలుతున్నాడు. హంసలూ కలవలూ నీళ్ళలో తేలుతున్నాయి. చందమామ ఆకాశంలో నీళ్ళలో తేలుతున్నాడు. కాలం అనంతంలో తేలిపోతోంది.

చప్పున అదిరిపడి పురూరవుడులేచి ఊర్వశి కోసం గుడ్డిగా వెతుక్కుంటున్నాడు.

ఊర్వశి :

ఏమిటి ? ఏమిటి ?

పురూరవుడు :

వున్నావా ? నిజంగా వున్నావా ?

ఊర్వశి అతన్ని దగ్గిరగా తీసుకుంది.

ఊర్వశి :

నే నెక్కడికీ వెళ్ళను నిన్ను వొదిలి.

పురూరవుడు:

నిజమా ! పోనీ ఎవరూ నిన్ను తీసుకుపోలేరా నానించి ? ఏ రాక్షసులూ, ఏ దేవతలూ.

ఊర్వశి :

ఎవరిశక్తిలోనూ లేదు.

పురూరవుడు:

ఏమో ?

ఊర్వశి :

ఏమిటా ? ఏమిటా, మహాయోధుడు, సర్వభూవలయ మకుటాధిపతి, పురూరవ చక్రవర్తి నన్ను రక్షిస్తోవుండగా ఎవరు తీసుకు వెళ్ళగలరు నన్ను ! ఎందుకా భయం ?

పురూరవుడు:

దుస్స్వప్నం వచ్చింది, అందువల్ల.

ఊర్వశి :

ఇంతేనా ! పడుకో. రా. ఇట్లా పడుకో. నా చేతుల్లోంచి ఎవరు తప్పించగలరు నిన్ను !

తనరొమ్ముకి అతన్ని అద్దుకుని నిద్ర పుచ్చుతోంది.

పురూరవుడు :

(మత్తుగా) నీ వక్షంలోంచి, ఊపిరిలోంచి ఏమిటో గొప్ప గానాలు. యీ లోకంలో వినలేని మధురవిపంచీరాగాలు ధ్వనిస్తాయి. నీ రొమ్ములలోంచి నాచంపల్లోకి ప్రపంచ శక్తులు ప్రసరిస్తాయి. నీ నేత్రాలు నిద్రబోయ్యే నా నేత్రాల లోనించి నా జడత్వాన్ని మేల్కొలిపి ఆకాశజ్యోతుల్ని వెలిగిస్తాయి. ఎవరు నువ్వు ! నామీద అంత ప్రేమేమిటి నీకు ?

ఊర్వశి :

నిద్రపో.

పురూరవుడు:

నువ్వు నిద్రపోవా ! ఎట్లా మేలుకుంటావు ?

ఊర్వశి :

ప్రేమ హృదయంలో పొంగి పొంగి పొర్లి నింపేస్తోవుంటే నిద్రఎందుకు ? ఏమీా చెయ్యడమెందుకు ? ఆలోచించడ మెందుకు ? ఎందుకనే ప్రశ్నే లేదు. ఇంక ఏ ఆలోచనకీ, తల పుకీ తావులేదు. వ్యవధిలేదు నిద్రపో.

పురూరవుడు నిద్రపోతున్నాడు. ఊర్వశి గొప్ప ప్రేమతో అతన్ని తలవొంచి చూస్తోకూచుంది. కాని కాలం ఎవరికోసమూ ఆగదు. వూర్వశి కోసమైనాసరే. తూర్పు తెల్లనయింది. చంద్రుడు అస్తమిస్తున్నాడు. పువ్వులూ పక్షులూ మేలుకున్నాయి

చిన్న ఎండ పడుతోంది. నీళ్ళమీదనించి ఎదటి చంద్రకాంత సోపానాలమీద. బైట గట్టిగా నగారా మోగింది. అసలు ఆ నగారా శబ్దం అసాధారణం. గొప్ప అవసరం కలిగితేనేగాని అది మోగ కూడదు. అదిగాక రాజాజ్ఞవల్ల వైతాళికుడు, దేవార్చన, మంత్రులు, పరివారం, ఎవరూ ఏ శబ్దమూ చెయ్యటంలేదు, ఇంతకాలమూ. కాని ప్రపంచాన్ని ఎంతవొదిలినా, ఏనాడైనా ప్రపంచం తనని తాను జ్ఞాపకం చేసుకుంటుంది. పురూరవుడు త్రుళ్ళిపడ్డాడు.

ఊర్వశి :

వాడి శిరచ్ఛేదం చేయించు.

ఎన్నోసార్లు మంత్రులు, పురోహితులు, రాయబారులు రాజకుమా రులు, బంధువులు రాజదర్శనాన్ని అర్థించి వొచ్చారు, కాని ఇంత వరకు అందర్నీ నిరాకరించాడు ఆ మహారసికుడు. కాని ఈ ఢంకా గొప్ప అవసరం. అపాయం కలిగితేనేగాని మోగదు. అదేఆలోచిస్తున్నాడు.

పురూరవుడు :

చూడాలి వాళ్ళని.

ఊర్వశి :

ఎందుకు?

పురూరవుడు:

ఏదో గొప్ప అవసరం కలిగివుంటుంది.

ఊర్వశి :

ఎవరికి?

పురూరవుడు :

నానించి వాళ్ళకి. లేక ఏదైనా అపాయమై వుండవొచ్చు.

ఊర్వశి :

ఎవరికి?

పురూరవుడు:

వాళ్ళకో... నాకో.

ఊర్వశి :

నీ కే అపాయముంది ఇక్కడ?

పురూరవుడు:

రావొచ్చు.

ఊర్వశి :

లోకంలో అపాయమూ, అవసరమూ ఎప్పుడూ ఉన్నాయి. వాటిని నిర్లక్ష్యం చెయ్యడమే వాటి నివారణోపాయం.

పురూరవుడు:

అట్లా తీసేస్తే పోయేవి కావు.

ఊర్వశి :

అల్పజ్ఞత్వం.

పురూరవుడు :

ఏమిటి? నీకు కనపడవా? అవును. ఈలోకం సంగతి నీ కేం తెలుస్తుంది?

ఊర్వశి :

కనపడక కాదు, తెలీక కాదు.

పురూరవుడు :

ఐతే ?

ఊర్వశి :

అంతే. నీకు అర్థంకాదు.

పురూరవుడు :

ఇప్పు డేం చెయ్య మంటావు?

ఊర్వశి :

నేనేమీ అనను. నీ స్వేచ్ఛకి ఆటంకం కాను.

పురూరవుడు:

మొత్తానికి నీకిష్టంలేదు.

ఊర్వశి :

ఊఁ.

పురూరవుడు:

పోనీ, అదేమిటో నేను తెలుసుకుని వాస్తే నేంపోతుంది?

ఊర్వశి :

శాంతి పోతుంది.

పురూరవుడు:

పోనీ,— కొద్దికాలం.

ఊర్వశి:

గడిచిన నిమిషం తిరిగిరాదు.

పురూరవుడు:

మరి నాధర్మం?

ఊర్వశి:

ఎవరియెడల?

పురూరవుడు:

వాళ్ళయెడల.

ఊర్వశి:

నీయెడల?

పురూరవుడు:

నాయెడలా?

ఊర్వశి:

ఇంకా అర్థంకాదు నీకు. ఆ ధర్మాలు— నీకు యజ్ఞాలూ, రాచరికాలూ ముఖ్యమైన దినాలలో కట్టుకున్న బంధాలు. ఈనాడు నువ్వు దీక్షాపరుడివి. నీధర్మం వేరు.

పురూరవుడు:

దీక్షాపరుణ్ణా!

ఊర్వశి:

అంతేలే, నీమనసునించి ఆ అభిప్రాయం పోలేదని తెలుసు నాకు శృంగారం, ప్రేమా చాలా తీవ్రమై కాలాన్నే కప్పి

నప్పుడు అవి వృత్త స్త్రీలోలత్వం మీా మనసుల్లో. నాలో ప్రమత్తుడినైనావని ఆ బైటవాళ్ళకి తెలుసునోలేదో! అదో విషయం కాదు. నీ మనసులో మాత్రం నువ్వు నీ కాలాన్ని వృథాచేస్తున్నాననీ, నీ ధర్మాలు నెరవేర్చటంలేదనీ, ఉత్త నిర్వీర్యుడివై, అసమర్థుడివై కాలాన్ని స్వార్థంగా, అధమంగా గడుపుతున్నాననీ అంతరాంతరంలో నీపైని నీకు నీచభావం వుండనేవుంది.

సుఖంకానీ, కష్టంకానీ ఏ స్థితివల్ల మానవుడికి ఔన్నత్యానికి తోవకలగదో అది వృథా. అందులో స్త్రీ శృంగారం వల్ల ఏమీా అధికంగా విజ్ఞానం తెచ్చుకోలేని వారు వృత్త దౌర్భాగ్యులు. ఈ లోకపు వెలుగులోకి ఆ జన్మకే కాదు, ఆ లోకపు వెలుగులోకి జన్మకికూడా స్త్రీయే ద్వారం.

పురూరవుడు :

నువ్వెవరు ? దేవతవా ? చెప్పితీరాలి నాకు.

ఊర్వశి :

పూర్తిగా జ్ఞాపకంలేదు. ఈ లోకం కాదు నాది; కాని ఎట్లాగో పూర్వపు జ్ఞాపకాలలాగు యీా లోకవ్యవహారాలు నాకు జ్యోతకమాతో వుంటాయి. అదీగాక ఔన్నత్యాన్నందుకున్న మనసులకు ప్రత్యక్షానుభవం అంత అవసరంకాదేమొ!

పురూరవుడు:

ఎందుకు అడుగుతున్నానంటే, ఏదో గొప్పవిజ్ఞానంతో అనుభవాధికారంతో మాట్లాడతావు.

ఊర్వశి :

జ్ఞాపకంలేదు. నువ్వు అనేభావం వొక్కటే నాలో యుగయుగాల్నించి నన్ను గాఢంగా ఆవరించిందని తెలుసు.

పురూరవుడు:

నేనా ? నేను యుగయుగాల్నించి వున్నానా ?

ఊర్వశి :

లేవా ? పురూరవుడివిగా లేవు. కాని నువ్వు ఏ రూపంలో, ఏ పేరుతోనైనా తేనేం వున్నావు. నీ కోసమే పతికాను ఎన్ని లోకాలో. కనపడ్డావు నువ్వు, అకస్మాత్తుగా నా ప్రయత్నం లేకండానే. నేనంతా నీలో లీనమై, నా ధర్మంలో అప్రమత్తురాలనైనాను. నన్ను నీతో వుండమని శపించారు. మనుష్యలోకానికా అని మూలిగాను. నాకు తెలుసు ఎంత సంకుచితమో ఈ లోకం. కాని నీకోసం వొచ్చాను, యీ శరీరాన్ని ధరించి.

పురూరవుడు:

శాపంవల్ల వొచ్చావా ?

ఊర్వశి:

ఏం ? ఎట్లా వొస్తేనేం ? వొచ్చానుకదూ !

పురూరవుడు:

బలవంతంవల్ల, నామీాద ప్రేమవల్ల అన్నావుకద .

ఊర్వశి :

మానుషుల మనసులు అట్లానే పనిచేస్తాయి. ముక్కలుముక్కలుగా కాక సత్యం అర్థంకాదు మీాకు. నాది మానవప్రేమ

కాదు. నా ప్రేమ అనివార్యం. తప్పదు నిన్ను కలుసుకోడం. కలుసుకోంది నా జీవితానికి అర్థంలేదు. గొప్పశక్తి తోస్తుంది నన్ను నీదగ్గిరికి. అది శాపంవల్ల గానీ వరంవల్ల కానీ. ప్రేమతో కలయిక అనే నిశ్చల వాస్తవం అనేక మార్గాల ప్రయోజనాలవల్ల సఫలమౌతుంది. నీమూర్ఖం, అజ్ఞానం, అల్పత్వం, నీఘనత, గర్వం ఇవేమీ అభ్యంతర పరచలేవు నాప్రేమని. నువ్వేదో నన్ను గొప్పగా అంగీకరించానని గర్వపడుతున్నావు. ఇంత అందం నీకు దక్కిందని పొంగి పోతున్నావు. నన్ను సంశయిస్తున్నావు. ఏ మాతావో నా ప్రేమవల్ల నని భయపడుతున్నావు. కాని నన్ను నువ్వు వొదలగలగడం అసంభవం. నీ జీవితపు విలవల్ని అన్నిటినీ మించిన అసలు నీఆత్మకి పట్టిన గొప్ప సత్యం నామీది నీప్రేమ. ఈ వ్యవహారలన్నీ కప్పుకుని, వాస్తవాన్ని చూడలేక చీకట్లోవలె వూరికే తడుముకుంటావు, పాపం.

పురూరవుడు:

నీరూపం, జ్ఞానం, తేజస్సు మానవాతీతం, అనుభవించి ఆశ్చర్యపడి చూసికూడా, నువ్వు నాచేతుల్లోకి వొచ్చి, నాపైన కాంక్షచూపే సామాన్య స్త్రీవనే మమతలో పడ తాను. నీవే ఆ మాయతెర కప్పుతావా నీపైని?

ఊర్వశి :

(అతన్ని దయగా ప్రేమగా వక్షంమీదికి తీసుకుని) నేను కాదు. నీమానుషత్వమే నిన్నావరించి మరిపిస్తుంది. అద్భు తమూ, అతీతమూ ఐన విషయాల్ని చూస్తోకూడా సాధార ణత్వం కింద సమర్థించుకునే అల్పస్థితి యీలోక దురదృష్టం.

అట్లానే కాకపోతే సూర్యోదయమనే పరమాద్భుతాన్ని ప్రతినిత్యమూ చూస్తూ, నిర్జీవంగా బతుకుతూ వుండగలరా! ఇంకో లోకంలోనే ఐతేనా ఆమహాకాంతి విజృంభణా సౌంద ర్యంలో అట్లానిలిచి తన్మయులై గొప్ప జీవశక్తితో, ఉత్సాహంలో, ఆరాధనలో సుషుప్తులై పోరా! తలుచుకో. ఈ తమస్సునంతా ఛేదించుకుంటూ, గొప్పజ్యోతి...

మళ్ళీ నగారా. పురూరవుడు ఆ శబ్దాన్నించి మనసుని మళ్ళించి ఆమెలోనిలవాలనే వ్యర్థప్రయత్నం చేస్తున్నాడు.

ఊర్వశి:

(నవ్వుతో) వెళ్ళు, ఏమిటో సంగతి కనుక్కో.

పురూరవుడు:

నువ్వూ!

ఊర్వశి:

నాసంగతి నాకు వొద్దులు.

పురూరవుడు వెడుతున్నాడు. వూర్వశి నవ్వుతోంది. పురూరవుడు తిరిగి వొచ్చాడు.

పురూరవుడు:

బట్టలు!

ఊర్వశి:

అట్లా కనపడరాదూ వాళ్ళకి, సమస్యే వుండదు.

పురూరవుడు:

అమ్మో!! (నవ్వుతున్నారు ఇద్దరూ)

ఊర్వశి :

ఈ వస్త్రధారణతోటే పూర్తి అయిం దనుకుంటాను, మానవుడి పతనం సత్యలోకంనించి, శరీరమానసికారోగ్యం నించి. మానవుడి కపటానికి బానిసత్వానికి చిహ్నం వస్త్రం. పోనీ, నువ్విక్కడ వుండు. నేను విచారించి వస్తాను.

నవ్వుతోంది.

పురూరవుడు:

నువ్వు ఎదురు వెడితే, వాళ్ళ మొహాలు చూడాలనివుంది.

ఊర్వశి :

(ఆ మాటలు వినిపించుకోక నిదానంగా) నీ బట్టలు ఆ చోటనే వుంటాయి. వెళ్ళి చూడు.

పురూరవుడు వెళ్ళబోతున్నాడు.

ఊర్వశి :

ఆగు, ఒకమాట.

ఊర్వశికి తన పూర్వజ్ఞానం ఎక్కువ స్ఫుటమౌతోంది. ఆమె శాపానికి లోబడి మాట్లాడుతోంది.

ఒకసారి నువ్వు వస్త్రధారణ చేశావా, ఇంక నా ముందు వివస్త్రుడివై కనిపించకూడదు.

పురూరవుడు:

(సిగ్గుతో) ఎట్లా మరి ?

ఊర్వశి :

వెలుగులో.

పురూరవుడు:

ఎందుకు?

ఊర్వశి :

నాకు తెలీదు. అంతే.

పురూరవుడు:

(దిగులుగా) సరే.

వెళ్ళబోతున్నాడు

ఊర్వశి :

ఉండు. రాత్రి ఏమిటి అట్లా భయపడ్డావు? ఏమిటా కల?

పురూరవుడు:

సరిగా మన కాసారమూ, పడవలో మనమూ. నేను మేలుకునే వున్నాను. ఇద్దరం పెనవేసుకునివున్నాము. ఆకాశం తెరుచుకుంది. పెద్దకాంతి లోకంమీద-మనని కనపరుస్తూ. గంభీరమైన పిలుపు. నిన్ను పిలిచారు. ఏదో నాకు తెలిసిన పేరుతోనే. నువ్వు ఉదిరిపడి నన్ను తోసేశావు. నావంక చూపైనా లేకండా ఆ పడవలోనించి పైకిలేచి దూరంగా ఆకాశంలో మాయమైనావు నీకోసం చేతులుజాచి, వూగి, పడవలోంచి నీళ్ళలో పడ్డాను.

ఊర్వశి దిగులుగా ఆలోచిస్తోంది.

పురూరవుడు:

నిజమౌతుందంటావా?

ఊర్వశి :

నాకు తెలీదమ్మా! ... కాని ... ఒకటినమ్ము, ఆపిలుపేవొచ్చింద నుకో, అది మృత్యువంత అనివార్యమూ, అనుల్లంఘనీయమైన పిలుపైతేనే గాని నేను వెళ్ళను.

పురూరవుడు :

ఎందుకు వెళ్లవు? ఏదో శాపంవల్ల ...

ఊర్వశి :

అట్లా కుంగిపోకమ్మా! నాకన్న జ్ఞానంలో మానుషత్వంవల్ల నువ్వు అల్పం గనక నేను నీతో ఎందుకు వుంటానని నీకు సందేహం, భయం, అవునా? విను. శాపం కాదు, వరం కాదు, విధి. చంద్రుడు సముద్రాన్ని పొంగించడం, సముద్రం మీద జాలివల్లనా, శాపంవల్లనా? అట్లాంటిసంబంధం నీతో నాకు విధిలో సృష్టితో ఏర్పడ్డది. నువ్వు నన్ను పొమ్మన్నా, వొదిలించుకోవాలని చూసినాకూడా నా ప్రేమ నిన్ను వొదల లేదు. అంత నిస్సహాయను. ఆమాట అనగానే అందుకా నాదగ్గిర వుండడం? అంటావు, నీ అల్పమనుష్య సంకుచి తత్వంతో-ఏమీ లోతులేని ప్రేమలకి అలవాటుపడి నువ్వు. నాసంబంధం అనివార్యమెందువల్ల! నా ప్రేమ అనివార్యం కనకనే.

పురూరవుడు:

కాని నానించి నీకేం ఆత్మవికాసం?

ఊర్వశి :

చూడు, తీసుకోడంకన్న, ఇచ్చుకోడంలోవుండే అప్రమేయా నందాన్ని ఎరక్క మాట్లాడే మాటలవి.

పురూరవుడు :

అట్లాంటి పిలుపువొస్తే ఏం చేస్తావు?

ఊర్వశి :

నీకు మృత్యువు వొస్తే ఏం చేస్తావు?

10

పురూరవుడు:

నాకు తెలీదు. నా వంకనన్నా చూడకుండా, నాకన్న ఆ పిలుపునకు ఎక్కువై వెళ్ళిపోతావా? ఏ లోకంలోనో వున్న నీ ప్రియుడి హస్తాలలోంచి జారావా నా మీదికి?

ఊర్వశి :

ఏమో! కాని అట్లా బాధపడకు. రా, చూడు. నీనించి వెళ్ళిపోవలసి వొస్తే నువ్వు పడగల బాధకన్న నా వ్యథ ఎన్నికోట్ల రెట్లు అధికమో! నిన్ను, నిన్ను! నిన్ను విడవగలనా? ఒకవేళ విడవవలసిన ఆజ్ఞే కలిగినా, నేను అనేది ఉన్నంత కాలం నీకై అన్వేషించనా? విధినే అదరకొట్టి నిన్ను తెచ్చుకోనా? నువ్వులేంది నేనేమిటి? నమ్ము నా మాట. ఇంక వెళ్ళు.

పురూరవుడు వెళ్ళాడు. ఊర్వశి కోనేరుహద్దున వెళ్ళి కూచుంది. హంసలు ఆమె పాదాలచుట్టూ చేరాయి. శీతాకోకచిలకలు ఆమె జుట్టుమీదా భుజాలమీదా వాలి ఆడుకుంటున్నాయి. ఎండలో ఆమె వొళ్ళు తేజస్సు ఆవరించినట్లు వెలుగుతోంది. గొప్ప చిరునవ్వుతో జుట్టు సోపానాలకింద పరుచుకుని ఆనుకుని కూచుంది. పురూరవుడు బట్టలు వేసుకుని వొచ్చాడు. ఆమె అందం చూడలేక రెప్పలార్పుతున్నాడు.

పురూరవుడు:

దేవీ, ఈ ప్రపంచైకైక సార్వభౌముడు నీపాదాక్రాంతుడౌతున్నాడు.

ఊర్వశి :

ఆ సార్వభౌమత్వంలో నా ప్రియుడు ఆచ్ఛాదితుడైనాడు.

పురూరవుడు :

వెళ్ళి వస్తాను.

ఊర్వశి అతన్ని చాలా జాలిగా చూస్తోంది. అతనికా మాపు
అర్థంకాలేదు. తనమీది విరహమనుకుంటున్నాడు.

పురూరవుడు:

నేను ఎక్కడికో దూర దేశం ప్రయాణమౌతున్నట్టు దిగులు
పడతావెందుకు?

అతని అహంభావానికి ఇంకా దిగులు పడుతోంది ఆమె.

ఊర్వశి:

ప్రయాణం, దూరంమీదా, కాలంమీదా అధారపడదు.
ఒకరి ఆలింగనంలో ఒకరు చాలా సన్నిహితులై చాలా
దూరాలు ప్రయాణం చేస్తారు. ఇంక తిరిగి ఆ ప్రేమతో
సమీపించలేనంత దూరాలు.

పురూరవుడు:

అట్లా అనకు. నాధర్మం మరి.

ఊర్వశి:

ధర్మం అంటే అర్థం తెలుసునా? మన నిగూఢమైన వాంఛ,
మన స్వభావాధికారాన్ని మించిన ధర్మం బైట ఎక్కడా
లేదు.

నిలవలేరు మానవులు.

ఆలోచించుకో, బైటప్రపంచం నీలో ఎంతపనిచేస్తోందో-
మార్పుమీద ప్రేమబంధాల, నిపాతయుద్ధాల, వేటల, సభల,
గౌరవాల ఆకర్షణలు ఎంత రహస్యంగా తీవ్రంగా నీలో పని
చేస్తున్నాయో!

అవే ధర్మచర్మాన్ని ధరించి నిన్ను భయపెట్టి బలవంతం
చేస్తాయి, పాపం!

పురూరవుడికి ఆమెమాటలు అర్థం కాలేదు. వెడుతున్నాడు.

అంతేకాదు, ఆ నగారా నువ్వే వాయించావు.

పురూరవుడు:

(ఆగి) అదేమిటి?

ఊర్వశి :

వాయింపించావు.

పురూరవుడు:

నేనా?

ఊర్వశి దగ్గిరికెళ్లి ఆమెవాళ్ళో మోకరించాడు.

నేనా? ఏమిటి? నేనా? ఎందుకు అట్లా అంటావు?

ఊర్వశి :

(దయగా) నువ్వే, బైటికి వెళ్ళవలసిన అవసరం నీలో జనించి వాళ్ళచేత మోగించింది.

పురూరవుడు:

అంటే?

ఊర్వశి :

అంతే, వెళ్లు.

పురూరవుడు:

వాళ్ళఅవసరం నన్ను రాజధానికి తీసుకుని వెడుతుందేమో!

ఊర్వశి :-

ఊc.

పురూరవుడు:

మరి నువ్వు!

ఊర్వశి:

వెళ్ళి తొరగా తిరిగిరా.

పురూరవుడు:

కాని ఏదైనా దీర్ఘయుద్ధం, ఆప్తులకు-

ఊర్వశి :

ఐతే ఏమంటావు?

పురూరవుడు:

నువ్వూ రా నాతో.

ఊర్వశి :

నీరాజధానికా? ...వివేకం కాదు.

పురూరవుడు:

కాని నీనించి వియోగాన్ని సహించలేను.

ఊర్వశి :

వొస్తాను, కానీ.

పురూరవుడు :

మరి నీకు వస్త్రాలు?

ఊర్వశి :

ఎందుకు ? అవసరంలేదు.

పురూరవుడు:

కాని, ఇట్లా, నువ్వు రాజధానిలోకి...

ఊర్వశి :

అవసరమైనప్పుడు నా తేజస్సుతో నే నానగ్నత్వాన్ని కప్పుకో గలను. నా విషయం ఏమీ ఆలోచించకు.

వెడుతున్నాడు.

పురూరవుడు:

(ఆలోచనగా) నేను రాజధానికి రావడం క్షేమకరం కాదేమో!

ఊర్వశి :

ఎవరికి? ఎందువల్ల?

పురూరవుడు:

మనుషులకి అతీతమైన సౌందర్యంగాని, జ్ఞానంకాని, మీ లోకంలో ఎంత విప్లవకారణాలో తెలీదా?

పురూరవుడు:

రానీ విప్లవం, మన ప్రేమకి విఘాతం చేనివల్ల కలగదు. తక్కిన వేమైతేనేం? భయపడకు.

ఊర్వశి :

నాకోసం కాదు భయం.

బైట నగారా పురూరవుడు వెళ్ళాడు.

## పురూరవుడి రాజధానిలో :

పురూరవుడితో ఊర్వశి రాజధానికి వొచ్చింది.
ఆమెని ఒకగొప్ప హర్మ్యంలో వుంచాడు.
ఆరాత్రి ఆమెమందిరం ముందువున్న వనంలో
వెన్నెలలో తిరుగుతున్నారు. మేడమీదనించి దీపాలకాంతి
చెట్లమీదా, ఫౌన్‌టెన్ల నీళ్ళకణాల మీదా మెరుస్తోంది.
ఆమె దేహంలోనించి కాంతే ఆమెకి గులాబి చీరని చుట్టింది.

ఊర్వశి :

నీకు చాలా సంతోషంగా వున్నట్టుంది.

పురూరవుడు :

ఎంత సంతోషమని! ఆ అడవిలో ఎక్కణ్ణించి ఎంతవింతగా వొచ్చావో అల్లాగే మాయమౌతావని భయపడేవాణ్ణి. కాని ఇక్కడ నా రాజధానిలో నా హార్మ్యాల్లో, నాసొంతం లాగు ధైర్యమనిపిస్తోంది.

ఊర్వశి :

(దయగా) పిచ్చిరాజా!

పురూరవుడు :

ఏమిటి?

ఊర్వశి :

ఆ నిబ్బరం ప్రేమకి ఎంత గొప్ప శత్రువో పూర్వానుభవం నించైనా నీకు తెలీదా?

పురూరవుడు :

ఊఁ, కాని, నిజంగా కాదు.

ఊర్వశి :

ఈ వస్త్రధారణ [illegible] కిష్టము కాదా

పురూరవుడు :

చాలా.

ఊర్వశి :

రంగురంగుల మబ్బులతో అలంకరించకపోతే, అంతే కాదు. కారుమబ్బులతో మెరుపులతో భయపెట్టకపోతే అగాధమైన

అనంతమైన నీలకాంతిని మాత్రమే ఆకాశాన్నించి ఏ మానవుడు అనుభవించగలడు?

ఊర్వశి చెట్టుకొమ్మమీద కూచుంది. అతను ఆమె నడుం చుట్టూచెయ్యేసి, ఆమెతొడమీద తలనానించి నుంచున్నాడు.

పురూరవుడు :

చాలా అందంగా వుందా?

ఊర్వశి :

ఏమిటి?

పురూరవుడు :

నా రాజధాని, నీ మందిరం, ఈ ఉద్యానవనం... ఇంతవరకు ప్రపంచంలో ఏ చక్రవర్తీ ఎరగడు ఇట్లాంటి అపురూప సంపదని, బావుందా?

ఊర్వశి :

ఊఁ.

పురూరవుడు :

నిజంగానా?

ఊర్వశి నవ్వుతోంది.

నన్నిట్లా హేళనచేస్తే నిన్ను చంపలు వాయిస్తాను.

ఊర్వశి :

మరి "నిజమా?" అని ప్రశ్న ఎందుకూ? నీకూ సందేహమే నన్నమాట.

పురూరవుడు :

నాకు సందేహంలేదు. కాని నీకెట్లా కనపడుతోందని.

ఊర్వశి :

అంటే, నాకింతకన్న గొప్పఅందాలు తెలుసునని నీకు సందేహం, అవునా?

పురూరవుడు :

అవును.

ఊర్వశి :

కాని నీకూ తెలుసు, ఇంతకన్న గొప్పసౌందర్యం. కాని నీకు తెలుసునని నీకు తెలీదు.

పురూరవుడు :

ఇంతకన్న అందం!

ఊర్వశి :

పోనీ అడివి ఇంతకన్న అందంకాదూ!

పురూరవుడు :

అవునులే ఒకవిధంగా-కాని—

ఊర్వశి చెట్టుమీదనించి దూకి అతనితో నడుస్తోంది. దీపాల వెలుతురు ఆమె మెరుగులో కలిసి కనపట్టం లేదు.

ఊర్వశి :

అందాల కలలకి రూపమిచ్చేకుంటేనే గాని, అందాన్ని అనుభవించడం చాతకాదు. అందుకనే మీలోకంలో కవిత్వం, శిల్పం, గానం, అవసరం.

పరుగెత్తుకు వెళ్లి యంత్ర జలధారల మధ్యనున్న రాతిమీదికి సునాయాసంగాదూకి ప్రతిమవలె చేతులుజాచి నుంచున్నది. ఆ నీటి మెరుపులో వస్త్రం మాయమయింది.

ఊర్వశి :

ఏం! రా. నన్నందుకో.

పురూరవుడు గొప్ప ఆరాధనతో చూస్తున్నాడు.

కాలం వృథా చెయ్యకు.

గొప్ప బరువుబట్టలు వేసుకున్న అతను నిస్సహాయుడై చూస్తున్నాడు. అతని దృష్టి తనని చూస్తున్నారేమోఎవరన్నా అని. అతనిమీద ప్రేమతో మమతపడి ఆమె అతనిదగ్గిరికి గంతేసి తడివొంటితోనే కావిలించుకుంది.

రా. నన్ను తీసుకో. నాతో నీ ఆత్మనే నింపుకో.

పురూరవుడు:

ముందుగా సందేహాలు తీర్చు. ఎప్పుడూ ఈ దేహసౌఖ్యమేనా ?

ఊర్వశి :

(నివ్వెరపోయి) ఏమన్నావు ?

పురూరవుడు:

(చూడక) ఎప్పుడూ ఎరుగుదును యీ శృంగారం. ప్రపంచమంతా వెతికి ఎక్కడెక్కడి అపురూపలావణ్య విగ్రహాల్ని చెరబట్టి తెచ్చుకున్నాను. నా తనివితీరా అనుభవించాను.

ఊర్వశి :

తనివి తీరానా ! అంతేనా నువ్వు ! ఏమొచ్చింది నీకు ఈ శృంగారంలోంచి! నీకేం బేధం తెలీటంలేదా ?

పురూరవుడు:

అవును. నీవు అపూర్వజ్ఞానవంతురాలివి. అధికురాలివి. నాకు జ్ఞానమియ్యి.

ఊర్వశి :

విజ్ఞానం, విశాలం, ఎక్కణ్ణించివొస్తాయి- శృంగారంలోంచి, ప్రేమలోంచిగాక !

రాజధానికి వొచ్చాక చాలగర్వమూ నిబ్బరమూ వొచ్చాయి నీకు. అనేక వేల స్త్రీలతో రమించడం నీ మనసుకి, గొప్ప శృంగారం. నీకు నీవేమిచ్చుకో గలిగావు ? నువ్వేమైనావు ? ఏం మారావు ? స్త్రీని నీ క్రీడాసాధనంగా ఉపయోగించు కున్న నువ్వు !

ఎంత తృణీకారం ! దేహసౌఖ్యం ! ! దేహసౌఖ్యం అంటే అర్థం తెలీని మనుషులకి!

రావోయ్ ! నేను లేనినాడున ఏడుస్తావు, పాపం !

పురూరవుడు:

నువ్వు లేనినాడు -

ఆమె పాదాలముందు వాలిపోతాడు.

పురూరవుడు:

నన్ను విడవకు. ఎందుకు వొచ్చావుమరి, నన్ను విడిచేదానివి?

ఊర్వశి :

నేను విడుస్తానా ? నువ్వు వొదులుతావా ?

పురూరవుడు:

మరి !

ఊర్వశి :

అంతే !

పురూరవుడు:

అంటే ?

ఊర్వశి :

నువ్వు వొదులుతావు. నేనువిడుస్తాను అని అర్థం. ఇంక అడక్కు రా. (అతన్ని కావిలించుకుని తనలోకి తీసుకుంటోంది.) నామీాడి నీ అవసరం నీకళ్ళది. నీ శృంగారవాంఛది. నీమీాది నా అవసరం యీా విశ్వం అవసరం, నన్ను నిన్ను కోరించి నీ దగ్గిరికి పంపిన ఆజ్ఞ అవసరం.

పురూరవుడు :

ఎవరి ఆజ్ఞ ?

ఊర్వశి :

నాకు తెలీదు.

పురూరవుడు :

ఎప్పుడో నువ్వు వెళ్ళాలనే ఆజ్ఞ వొస్తుందా ?

ఊర్వశి :

ఆ లోకంలో ఈ లోకంలోకూడా ఆజ్ఞలు అట్లారావు. వెళ్ళవలసిన నిమిషం స్పష్టంగా తెలుస్తుంది.

పురూరవుడు:

మరి నేనూ...

ఊర్వశి :

నీకూ నేను అవసరమౌతాను.

పురూరవుడు :

నాకు...

ఊర్వశి :

ఈ వేడ్చే, వాంఛించే, నవ్వే నీకుకాదు, అసలు నీకు. అసలు నువ్వైన నీకు.

ఈ లోకంలో మృత్యువూ అంతే. నామాట నమ్ము. అంత ఘోరంగా విధిని తిడతారా మానవులు! ఈ దుఃఖం, వ్యథ, రోగం, అంతావాళ్ళకే తెలీని మనుష్యుల స్వాంతఅవసరాలు, నిగూఢ వాంఛలు. చావుకి ఏడుస్తారా? ఆ ఎడబాటుని బతికి వున్నవాళ్ళూ చచ్చినవాళ్ళూ ఇద్దరూ కోరుకుంటేనే జరుగుతుంది. నిజం విను. ఈ సృష్టిలో క్రూరత్వమూ, అన్యాయమూ, అనే పదాలు వినరావు. ఎక్కడా లేవు. నమ్మతావా?

పురూరవుడు:

ఎట్లా నమ్మను, లోకాన్ని చూస్తో! రేపు నేను యుద్ధానికి వెళ్ళినప్పుడు, జరిగే వేలకొలది ప్రజలహత్య-ఆ కుటుంబాల దారుణ విఘాతం....

ఊర్వశి:

ఐతే ఎందుకా యుద్ధం?

పురూరవుడు:

ఎందు కేమిటి? (ఊర్వశి మాట్లాడదు.) మాట్లాడవేం!

ఊర్వశి:

ఏం లేదు ఎప్పుడూ నువ్వు యోచించ లేదనుకుంటాను, యుద్ధానికి వెళ్ళడం తప్పదా?

పురూరవుడు:

తప్పదు.

ఊర్వశి:

నువ్వు తిరిగివొచ్చేవరకు ఏం చెయ్యను?

పురూరవుడు:

ఏం చెయ్యాలేమిటి? నిన్నూ వెంటతీసుకుని వెడుతున్నా నుగా! నిన్ను వొదిలి ఎట్లా వెడతాననుకున్నావు?

ఊర్వశి:

పిచ్చివాడా! నన్ను వెంటపెట్టుకుని యుద్ధం చెయ్యగలవా?

పురూరవుడు:

కాని నిన్నువొదిలి యుద్ధానికి వెళ్ళగలనా?

ఊర్వశి:

అవును, వెళ్ళలేవు.

పురూరవుడు:

మరి?

ఊర్వశి కోనేరుదగ్గిరికి నడుస్తోంది.

పురూరవుడు:

మరి కర్తవ్యం చెప్పవా?

ఊర్వశి:

తెలుస్తోనే వుంది.

నవ్వుతోంది.

పురూరవుడు:

ఎట్లా మానను నా యుద్ధం? గౌరవం, పౌరుషం, నా సేనానుల యెడల నా ప్రతిష్ట... నా శత్రువుల ధిక్కారం...

దిగులుగా యోచిస్తున్నాడు. ఊర్వశి తిరిగివొచ్చి అతని తలని తన రొమ్ముమీదికి తీసుకుంది.

పురూరవుడు:

ఏం చెయ్యనూ?

ఊర్వశి :

ప్రేమపరీక్ష.

పురూరవుడు :

రాజ్యంలో చాలాగొడవలు రేగుతాయి సుమా !

ఊర్వశి :

(అతన్ని లాలిస్తో) పాపం !

పురూరవుడు :

నన్ను నేనే భరించలేను. స్త్రీ మమతలోపడి...

ఊర్వశి తటాలున తోసేసి దూరంగా జరిగింది.

పురూరవుడు:

అపరాధిని.

ఊర్వశి నవ్వుతోవొచ్చి అతని హారాల్ని సర్దుతోంది.

ఊర్వశి :

వెర్రి మహారాజా ! స్త్రీలో మమత మహాయజ్ఞం, మహాయోగం. దీక్షాపరుడై సహాబు ధర్మపాలనం లోపంకలిగిందని కించపడడు.

పురూరవుడు:

(బిడియంగా) నా యుద్ధప్రావీణ్యం నీకు చూపుదామనుకున్నాను.

ఊర్వశి :

నాకు తెలీదా ?

పురూరవుడు:

ఎట్లా తెలుస్తుంది వృత్త నా మాటలు తప్ప ?

ఊర్వశి :

యుద్ధంలో నాకు కనిపించేదేమిటి? నీ నేర్పు, నీ రౌద్రం, నీ శౌర్యం, యుద్ధం చెయ్యనప్పుడైనా నీలో ఇవి కనపడక పోతే, అవన్నీ నీలో చాలా అల్పమన్నమాట. కాక నేను చాలా అంధురాలనన్నమాట. ఈ హార్మ్యాలూ, యీ వనాలూ, వీటిని నిర్మించిన నీ సౌందర్యభావం, ఐశ్వర్య వైభవం, నీలోకాక, వాటిల్లోనే కనపడితే, నిన్నెవరు ప్రేమిస్తారు? తమ భర్తలలో ఆ విశాలత్వం, గర్వం, ఘనతా, కనపడకనే, స్త్రీలు, భర్తల్నిగాక వాళ్ళ ఐశ్వర్యాలనీ, కీర్తినీ ప్రేమిస్తారు. కార్యశూరత్వం, మనిషికి నైతికాభివృద్ధి నియ్యాలి. అప్పుడే నీవు జయించిన చక్రవర్తుల కిరీటమణులు నీ కళ్ళలో మెరుస్తాయి, నీకార్యాలజయాల కీర్తి ముందు సంతతికవులు పాడేందుకు. నిన్నే నా చేతుల్లో అనుభవించే నాకెందుకు?

పురూరవుడు:

ఎట్లా లభించింది నాకీ మహాపకారం? ఇట్లాచుట్టూ చెయ్యేసి దగ్గిరికి తీసుకునేందుకై ఏ రాజ్యాలైనా వొదులుతాను.

ఊర్వశి :

(వెక్కిరింపుగా) కాని కేశి యుద్ధానికి బైలుదేరకపోతే మాత్రం...

పురూరవుడు :

(జ్ఞాపకంవొచ్చి) అవును. చాలాగొడవ.

ఊర్వశి :

అంటే నాకన్న నా గొడవే ఎక్కువ ప్రాముఖ్యమైంది నీ మనసులో.

పురూరవుడు:

మరి ధర్మాన్ని తప్పే నామీద నీకుమాత్రం ఏ గౌరవం ముంటుంది ?

ఊర్వశి :

నీ మాటలకన్న, పనులకన్న, ధర్మాలకన్న, నీ యోచనల కన్న లోతుగా అసలు నిన్ను చూడగలనని మరిచిపోతా వెందుకు ?

పురూరవుడు:

మరి తక్కినవాళ్ళ కళ్ళకి...

ఊర్వశి :

తక్కినవా ళ్ళేవఘన్నారు, నేనూ నువ్వూకాక !

పురూరవుడు:

ఉన్నారు మరి.

ఊర్వశి :

అట్లాచూ స్తే నేనిక్కడికి రావడమే ఎవరికీ ఇష్టంలేదని తెలుసు కదూ నీకు ?

పురూరవుడు:

ఊ.

ఊర్వశి :

ముఖ్యం నీ పట్టమహిషులకి-నీ పుత్రులకి...

పురూరవుడు:

ఊ. పైగా కారణంలేదు-ఎందరు స్త్రీలను నేను తెచ్చి అనుభ వించలేదు ? ఎందువల్ల నీపైని యీ కార్పణ్యం మనుషులకి?

ఊర్వశి :

తమ సామాన్యత్వానికి, మానవత్వానికి దిగని ఔన్న త్యాన్ని ప్రపంచం ఎన్నడూ క్షమించదు.

ఈమధ్యాన్నం ఎవరువొచ్చారనుకున్నావు నన్ను చూడ్డానికి ?

మృణాళిని.

పురూరవుడు:

మృణాళినా ?

ఊర్వశి :

ఊ. నిన్ను తనకి వొదిలెయ్యమని నన్ను అడగడానికి.

పురూరవుడు:

నిజమా ? ఏమన్నావు, పాపం !

ఊర్వశి :

చాలా వెర్రిపిల్ల. నీపైన గొప్ప ప్రేమ ఆమెకి.

పురూరవుడు:

అవును. (కళ్ళంబడి నీళ్ళు) ఎట్లా చెప్పను నీకు ? అదొక గొప్పగాధ. నాకు ఎన్నటికీ అందని రాజపుత్రి, నా జీవిత మంతా గొప్పగా ప్రేమిస్తానని వాగ్దానంచేసి నేను బంధించు కున్న హృదయం.

ఊర్వశి అతన్ని పక్కన కూచోపెట్టుకుని వోదారుస్తోంది.

ఊర్వశి :

అంతే జీవితం.

పురూరవుడు:

ఏమన్నావు ఆమెతో ?

ఊర్వశి:

చాలా జాలితో ఆమెతో ఐక్యమైనాను.

పురూరవుడు:

ఒక్క రోజు నన్ను చూడకండా వుండలేదు మృణాళిని. భరించలేను తలుచుకుంటే, ఏమైపోతోందో?

ఆమెను అప్పుడప్పుడు చూడనా,

నిశ్శబ్దంగా కూచున్నారు. మేడలోంచి సంగీతం
వినపడుతోంది. చంద్రుడు ఉదయిస్తున్నాడు.
చుట్టూ పువ్వులు వెన్నెల్లో వూగుతున్నాయి.

ఊర్వశి:

చూడు. దేనికీ నన్నడగకు. భయపడకు నేను వెడతానని. ఔనా? ఎంత జాగ్రత్తపడీ నువ్వు నేను వెళ్ళకండా ఆపలేవు. జాగ్రత్తవల్ల తాము భయపడే అపాయంలోకే సరాసరి నడుస్తారు మనుషులు. నేనుకాదు వెళ్ళేది; నువ్వుకాదు వొదిలేది.

పురూరవుడు:

మళ్ళీ అదేమాట అంటావు, ఎన్నడూ వొదలనని చెప్పలేదా నన్ను? అడివిలో ఎంతో సమ్మించలేదా? అప్పుడే నాపైని విరక్తికలిగిందా నీకు?

ఊర్వశి:

కలగవలిసిందే. నీఐశ్వర్యం, నీగొప్ప, నీయుద్ధాలు, నేనివన్నీ మెచ్చుకోవాలనే నీఆశ. విరక్తి కలగవలసిందే. (నవ్వుతోంది.)

కాని నాది ప్రేమ. ఈ ఘనతలన్నీ నిన్నంటని పై మెరుగులైనట్టే, యీ అల్పత్వాలు నిన్నంటిన వెర్రిలోపాలు-నువ్వు

వేరు. నువ్వు నా అనంతపథసహచారివి లోపాలు నీ దేహానివీ, మనస్సువీ. లోకవ్యవహారాల సంఘర్షణలు అవి.

పురూరవుడు:

మరి నన్ను వొదలడ మేమిటి?

ఊర్వశి:

నేను వొదలను. కాని వొదిలించుకుంటావు గావును.

పురూరవుడు :

నేనా ? నిన్నా !

ఊర్వశి మాట్లాడదు.

మాట్లాడవేం ?

ఊర్వశి :

నాకంతకన్న తెలీదు.

ప్రియురాల్ని కాదు నువ్వు విశ్వసించవలిసింది. నీ ప్రేమను. ప్రియురాల్ని విశ్వసించి, భంగపడి ప్రేమని తిడతారు మానవులు. ప్రియురాలికన్న కాదు, ప్రేమకన్న ముఖ్యమైనది వుండడానికి అర్హత లేదు—ఏ ధర్మానికీ.

పురూరవుడు:

ప్రియురాలు ఆదర్శ స్త్రీ కాకూడదా ?

ఊర్వశి :

తన ఆత్మ వైశాల్యానికి అనుగుణ్యంగా ప్రియురాలు తటస్థిస్తుంది.

పురూరవుడు:

నువ్వా !

ఊర్వశి :

నేనైనా, నీ అసామాన్య సుకృతంవల్లనే.

పురూరవుడు:

నామీద ప్రేమవల్ల కాదా?

ఊర్వశి:

నీ సుకృతమే నీ ఘనత. నీఘనతే నా ప్రేమను తెచ్చుకో కలిగింది.

లోపల్నించి సంగీతం. పురూరవుడి కళ్ళలో నీళ్ళు.

ఊర్వశి:

ఏమిటా జ్ఞాపకాలు?

పురూరవుడు:

మృణాళిని పాట, ఆమె ఇష్టపడే గీతం.

ఊర్వశి:

చాలా వేదనపడుతోంది.

పురూరవుడు:

ఆమెని ఓదార్చకూడదా?

ఊర్వశి:

ఎవరు?

పురూరవుడు:

నేను.

ఊర్వశి :

ప్రియురాల్ని కాదు. ప్రేమని ప్రశ్నించు.

పురూరవుడు:

నువ్వా! ఆమెని ఓదార్చలేవా?

ఊర్వశి :

నేనా ? నిన్ను వొదలడం ఒక్కటే సాధనం.
అది నాతరం కాదు, నీ తరంకాదు.
నేను వొదిలినా, నువ్వామెకు శాంతినివ్వలేవు.

పురూరవుడు :

ఏమిటి అభ్యంతరం ?

ఊర్వశి :

నువ్వూ, ఆమే. మీఇద్దరూ మీఇద్దరి ఆనందానికీ అభ్యంతరాలు. కాలంలో సాగి ముందుకునడిచిన నువ్వూ, అక్కడే కూచుని చేతులుజాచే ఆమే. సరిగా పరీక్షించుకో. ఆమె మీద ప్రేమా నీకు? జాలి. ఔనా ?
నన్ననుభవించిన నీకళ్ళు, నీ చేతులు, పాపం, ఆమె కేమివ్వగలవు ? ఆమె నీ నించి ఏం తీసుకోగలదు ?

పురూరవుడు :

దిగులు నాకు.

ఊర్వశి :

జీవితం ముందుకు సాగింతరవాత, వెనక్కి చూసి దిగులు పడడం వ్యర్థమైన వేదన.

పురూరవుడు :

కఠినంగా మాట్లాడుతున్నావు కాదూ ?

ఊర్వశి :

అవును. నీ దిగులేదో కాఠిన్యంకన్న మార్దవమూ, ఔన్నత్యమూ అనుకుంటున్నావు. తాము ఎక్కడ సహాయపడలేరో, అక్కడ దిగులుపడి, తమకర్తవ్యం తీర్చుకున్నామని

సంతుష్టి పడతారు మానవులు. జాలీ, దిగులూ, చాలా కపటం, బలహీనం, ఉంది మీలోకంలో. ప్రతిఅడుగుకీ వ్యధ; జాలి. ఎవరికి ఉపకారం?

మీలోకంలో ఏడుపు ఒక ధర్మమైపోయింది. అందరూ సరే. నువ్వు యీ అవివేకాలకి వశ్యుడివి కావడానికి వీలు లేదు.

ధీరాత్ములు, స్థితప్రజ్ఞులు, లోకంలో అసాధారణ వ్యక్తులు – వాళ్ళ జీవితాలు వాళ్ళ సొంతంకాదు. వాళ్ళఅల్పత్వాలని వెర్రివాంఛల్ని మించిన మహాశక్తి వాళ్ళని ఉపయోగించుకుంటోంది. గనకనే వాళ్ళు మానవులలో ప్రత్యేకమైన వారైనారు. వాళ్ళు ధర్మాలకీ, నీతులకీ, అతీతులు. వారి పథం అగ్నిహోత్రం. వారికి రెండోమార్గం కనపడనీదు. శాంతి సౌఖ్యాలకి విదూరులు.

నేను చెప్పలేదా నువ్వు ప్రేమదీక్షాపరుడివని. ఉన్నత గమన మంటేనే, పూర్వబంధ నాశనమని అర్థం.

చూడు. ఈవెన్నెల. ఆపాట. నీచుట్టూ నాచేతులు. వీటిల్లో ప్రశ్న, మాట, లేకంటూ నిలవలేకపోవడం ఎంత దురదృష్టం!

రా. దగ్గరిగా రా. గొప్ప అదృష్టవంతుడివి నువ్వు. నీ రాజ్యం కాదు. నీఐశ్వర్యంకాదు. చివరికి నేనూ కాదు. నాలోనించి వూపి కళ్ళుమూసి ఈ విశ్వ రహస్యంలోకి కళ్లు తెరిపిస్తాను నిన్ను.

మందిరంలోంచి నృత్యం, సంగీతం. ఊర్వశి కాసారంవొడ్డున నృత్యంచేస్తోంది. పురూరవుడు సర్వమూ మరిచి ముగ్ధుడౌతున్నాడు.

మర్నాడు:

సాయంత్రం సూర్యుడి పచ్చనికాంతి మబ్బుల్ని వెలిగించి
ఊర్వశీ హర్మ్యంలో బాల్కనీలోకి పడుతోంది.
మొహమల్ పరుపుల సోఫామీద ఊర్వశి బంగారు
రవ్వల హారాలూ, కంకణాలూ ధరించి పడుకుని
వుంది, ఆసూర్యుడి వంక రెప్పవాల్చక చూస్తో.
చాలా అలిసి చిరాకుగా వచ్చాడు పురూరవుడు.
ఆమె కదిలినప్పుడల్లా ఆమె దేహమూ రవ్వలూ ధగ ధగ
మెరిసి సూర్యుడికన్న దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.
పురూరవుడి కళ్ళు డాజిల్ ఐ ఆమె కనపడదు అతనికి.
ఊర్వశిలేచి అతనివేపు వెళ్ళింది.

పురూరవుడు :

ఏమిటీ వెలుగు ?

ఊర్వశి :

నేనూ... రా...

కావిలించుకుని తీసుకువొచ్చి కూచోపెట్టింది. మధువును
అతనికి తాగడానికి అందిచ్చింది. అతనుపరధ్యానంగా వున్నాడు.

ఊర్వశి :

గొడవలు , ఏం!

పురూరవుడు :

భరించలేను.

ఊర్వశి :

ఏం చెయ్యగలవు అవన్నీ నిన్ను! బాధ్యతలు, విధులు,

భయాలు, అనే ముళ్ళు మనసునించి తప్పిపోతేనేగాని ఆనం
దానికి స్థలం ఏర్పడదు.

పురూరవుడు :

ఎంత దౌర్భాగ్యం రాజునై పుట్టడం, అంతటితో తృప్తిలేక
సమస్త భూమండలాన్నీ జయించి అధిపతిని కావడం-స్త్రీలూ
సంసారమూ, పుత్రులూ, మంత్రులూ ...
ఏ కొండకోనలలోనో, ఏ వేటగాణ్ణో, ఏ గొల్లవాణ్నో ఐవుండి
నిన్ను కలుసుకునివుంటే ...

ఊర్వశి :

రా. అట్లాగే పోదాం. రా.

పురూరవుడు :

నిజంగా వెళ్ళిపోదామా?

ఊర్వశి :

తప్పకండా. కాని యీ జ్ఞాపకాల్ని వొదలాలి నువ్వు. వొద
లక పోతే ఎక్కడికి వెళ్ళీ ఎవరుగామారీ ప్రయోజనంలేదు.
కాని ఆ జ్ఞాపకాల్ని వదలగలిగితే ఎక్కడికీ కదలనే అక్క-
ర్లేదు.

పురూరవుడు :

కాని పుట్టడమే గొల్లవాణ్ణై పుట్టివుంటే!

ఊర్వశి:

ఏ గొల్లభామో నీ ప్రియురాలై వుండేది.

పురూరవుడు :

నువ్వు నాకు తటస్థించి వుంటే—

ఊర్వశి:

తటస్థించను.

పురూరవుడు :

ఏమిటీ? నా ఐశ్వర్యం వల్లనా?

ఊర్వశి:

అందువల్లకాదు. నానించి గొల్లవాడు ఏం తీసుకుంటాడు? నాకేమియ్యగలడు? పూర్తికే వాంఛిస్తారుగాని, తమ అర్థకల్పి తలుచుకోరు మనుషులు. నేను ఏ శాపంవల్లనో గొల్లవాడి వొళ్ళోవాలినా, నన్ను నిలుపుకో గలడా? శాపాలూ, వరాలూ, అంత బుద్ధిలేని వ్యవహారాలనుకోకు.

పురూరవుడు :

ఇదివరకు ఈ సమస్యలింత బాధించేవి కావు. కాని ఇప్పుడు ఎందుకో చాలా బరువౌతున్నాయి మనసుమీద.

ఊర్వశి :

అవును. అపరాధివని అనుకునే నీ అంతఃకరణవల్ల.

పురూరవుడు :

ఏమిటీ?

ఊర్వశి :

ఏమంటున్నారు నీమంత్రులు? ఏమనుకుంటున్నారని నీకు తెలుసు?

పురూరవుడు :

యుద్ధానికి నేను రాకపోవడం – స్త్రీలోలత్వంవల్లనని. ఎట్లా భరించను? ఎందుకు భరించలేను?

ఊర్వశి :

అది నిజంగనక.

పురూరవుడు:

నిజమా?

ఊర్వశి:

నువ్వు నీఅంతరాంతఃకరణంలో నన్ను నిజం చేసుకున్నావు గనక!

పురూరవుడు

వాళ్ళ మనసుల్లో లేదంటావా?

ఊర్వశి:

నీ మనసనేది వేరుకాదు. నీమనసునే వెయ్యిదిక్కుల వెయ్యి మనసుల్లో ప్రతిఫలింప చేసుకుంటావు. ఎన్ని జన్మలనించో నీలో నువ్వు అన్వేషించుకున్న శృంగారాన్నే ఇదివరకు అనేక స్త్రీరూపాల, ఈనాడు నారూపాన, నీచేతుల్లోకి తీసుకుని అనుభవిస్తున్నావు. అంటే - నేను - యుగాల ఫలితమైన నీశృంగార వాంఛ నారూపం ధరించి వొచ్చిందన్నమాట.

పురూరవుడు:

వాళ్ళచూపుల్లో నింద! వాళ్ళమాటల్లో దాక్కున్న అపహాస్యం! నాలో వాళ్ళ ఆశ్చర్యం, నా అసమర్థత!

ఇంకా మధువుని ఇస్తోంది.

ఊర్వశి:

పోనీ అవన్నీ నిజమేననుకో. పోదితెయ్యి. వాళ్ళెవరు నీకు?

పురూరవుడు :

ఎట్లా వొదలను? మరి నేనదో చెయ్యాలికద! మీలోకంలో ఇట్లాంటి సమస్యలురావా?

ఊర్వశి :

సమస్యలు వుండవు. ఏంచెయ్యాలో స్పష్టంగా తెలుస్తోనే వుంటుంది. మావెంట జ్ఞాపకాల్ని ఈడ్చుకుంటోతిరగం. అందువల్లనే స్వేచ్ఛ అనేదిలేదు ఈ లోకంలో. ఎక్కడ భారమైతే అక్కడే ఆ పరిస్థితిని వొదిలి, సుఖంలోకి వెడ తారు అక్కడ. (నవ్వుతో) చాలాసులభంగా మహా రాజులు ఒక్కక్షణం గొల్లపిల్లవాళ్ళవుతారు. ఆగొల్లలు మహారాజుల్ని తలుచుకుని ఈర్ష్యపడరు.

పురూరవుడు:

కాని ఈ లోకంలో అట్లాకాదు. మనంవున్న స్థితికే భంగం కలుగుతుంది. సృష్టిగాని, మనుషులుగాని ఎవర్నీ స్వేచ్ఛలో వొదలరు, ఆకలీ, శత్రువులూ...

ఊర్వశి :

అవును. మరణం, బాధా, ఈరెండు పెద్దభయాలవల్లా!

పురూరవుడు :

ఆలోకంలో లేవా !

ఊర్వశి :

లేవు- ఎందుకంటే అవి లేకపోవడం, వాటిభయంలేదు గనక అవిలేవు.

పురూరవుడు :

మరి దేహాలులేవా?

ఊర్వశి :

ఉన్నాయి. కాని ఆ దేహాలు ఏమౌతాయోనన్న భయంలేదు. వాంఛవల్లనే భయం.

పురూరవుడు:

నువ్వేదో సమస్యల్లో మాట్లాడుతున్నావు.

ఊర్వశి :

(దయగా నవ్వుతో) మనకి అర్థంగాని సత్యమే సమస్య. బాధ అంత బాధకాదు, బాధకలుగుతుందనే భయమంత. ఆ భయంవల్ల జాగ్రత్త. జాగ్రత్తే గొప్ప బంధం. అసలు బాధే అది. ఆజాగ్రత్త మనసుని కిందికి లాగకపోతే, అసలు బాధలో అంత బాధలేదు.

పురూరవుడు:

ఏమిటో చెవుతావు మాటలు. కాని యీ నా సమస్యల్ని తీసెయ్యలేవు.

నవ్వుతో ఆమె అతన్ని కావిలించుకుంది.

ఊర్వశి :

మనస్సులో యీ ముళ్ళనించి తప్పించుకోవాలనే నీబాధే చాలా ఉన్నతం. ఎంత ఇరుకు మానవజీవితం!

ఈ దేహాన్నీ మనస్సునీ నేను నీకోసం ధరించడమంటే, ఎట్లా ఉంటుందనుకున్నావు? నువ్వు, ఏ విడవలేని ప్రియురాలి కోసమో గాలీ కాంతీ లేని మురికికూపంలోకి వెళ్ళి నివసించాల్సి వొస్తుందనుకో, ఈవిశాల సుందర దృక్పథంనించి, యీ ఆత్మతోనే, నువ్వు కీటక శరీరంలో ప్రవేశించావనుకో. ఎట్లా అనిపిస్తుంది? అట్లా వుంటుంది నాకు. ఈశరీరమూ

ఈ ఇంద్రియాలే చాలా ఇరుకు. వాటివెనక ఆ మనసు...
ఇంత స్పష్టమైన విశాలత్వంలో ఇన్ని చీకట్లూ మూలలూ ఎట్లా కల్పించుకోగలుగుతోంతో నీమనసు అని జాలి పుడుతుంది. నీ బాధల్ని ఎదుర్కొని వీటిస్వభావం రహస్యం ఏమిటని ధీరంగా ప్రశ్నించే బలం లేదా నీకు? ఎందుకు అట్లా దాక్కుంటావు?

పురూరవుడు:

ఎక్కడ దాక్కుంటాను?

ఊర్వశి:

నీనించీ, నానించీకూడా.

పురూరవుడు:

నీనించా?

ఊర్వశి:

అవును. నామీద నీకెన్ని అనుమానాలు! నాలో ఎంతఅసంతుష్టి! ఎంత భయం! నిన్ను నువ్వు నీనించి రక్షించుకో లేనప్పుడు ఇంకోరికి నిస్సంకోచంగా, నిన్నునువ్వు అప్పచెప్పుకోవాలి.

నేనెవరనుకుంటున్నావు? ప్రేమ మూర్తిత్వాన్ని చెంది నీచేతుల్లోకి వొచ్చింది. నానించి ఆ వేరుతనాన్ని తీసేసుకుని సాకు నిన్ను నువ్వు ఇచ్చుకోగలిగితే! స్పష్టపరుచుకో నీ ఆలోచనల్ని. నాలో నీకేమీ అసంతుష్టి లేదనకు. నాకళ్ళనించి దాచలేవు. ఎందుకంటే నీ మనసుతో ఐక్యం కాగలశక్తి నా మనసుకి వుంది. నీ దేహంతోనే కాదు.

పురూరవుడు:

ఐతే నాకెందుకు కాంతి నివ్వలేవు!

ఊర్వశి :

నీ దేహాన్ని ముణుచుకుని నానించి దాచుకున్నావనుకో. నీకు శృంగారా న్నివ్వడం నాతరమా? చెప్పు నాతో మాటల్లో.

పురూరవుడు:

నీకు తెలుసుగా.

ఊర్వశి :

నాకోసం కాదోయ్. నీకు నువ్వు చెప్పుకో. నిజంమాట్లాడు.

పురూరవుడు:

చాలాసార్లు మాట్లాడదామనుకున్నాను. కృతఘ్నతగా తోచి ఆగాను. అది గాక, మనస్సుకి పూ ర్తిగా స్పష్టంగాని విషయాలు, మాటలలోకి తీసుకొస్తే, అవి అబద్ధా లౌతాయి కూడానూ! ఆ బలవంతం వల్ల.

ఊర్వశి :

కాని నాతో.

పురూరవుడు:

నీ అధికారం నాకు బాధ. నువ్వు జ్ఞానవంతురాలివే కావొచ్చు. కాని నాకన్న ఉన్నతంగావుండడం సహించను. నేనేమిచ్చి, ఏమిచూపి నీముందు గొప్ప కాలేని నిరాశ నాలో.

ఊర్వశి :

నిన్ను నువ్వు ఇచ్చుకున్నప్పుడు తప్ప—అప్పుడు నా రాజాధిరాజువు—

పురూరవుడు :

అవును. కాని పురుషుడికింద, చక్రవర్తికింద, నా ఆధిక్యతని ధృఢపరచాలని వుంటుంది. అంతేకాదు, నువ్వు నిస్సహా

యవై, కన్నీళ్ళతో, కోపాలతో, అల్పత్వాలలో నామీద ఆనుకోవాలనిపిస్తుంది. నీ లావణ్యాన్ని, నీ తేజస్సుని, నాదిగా నా ప్రజల ముందు చూపుకోవాలని...

అదిగాక, యుద్ధాలు ఉత్సవాలు, సభలు, కొలువులు, న్యాయవిచారణలు ఇవన్నీ చేస్తోవుంటేనేగాని, నాకు జీవిస్తు న్నట్టు వుండదు.

ఊర్వశి :

అవును. సాధారణ స్త్రీ ముందు కార్యనిమగ్నుడై కాని, పురుషుడు ఘనతని నిలబెట్టుకోలేడు. కాని స్త్రీకి పురుషుడిముందు కొరతపడని, ఏకార్యసాధన వల్లా ప్రకటించనవసరం లేని సహజమైన ఆత్మగౌరవముంది. ఎన్నడూ తనకి లొంగని ఆమెలోని ఆధిక్యతవల్లనే స్త్రీపైన పురుషుడిలో గాఢ ద్వేషానికి కారణం.

తాను నిస్సహాయ ఐనట్లు మోసపుచ్చుకుని తాను పురుషుడిపై పెనవేసుకుని అతనినించి ఆదరణపొందే ఆనందం స్త్రీ చాలా వాంఛిస్తుంది. కాని ఆమె భారగముందు వొరిగిపోయే ఆమె విజ్ఞానం ముందు తేలిపోయే పురుషుణ్ణించి ఏమి తెచ్చుకోగలదు? ప్రేమబంధం బలీయమైనప్పుడు తల్లీ గురువూ అవుతుంది.

బైట దిగులుగా గంట.

పురూరవుడు:

(ఉలిక్కిపడి) ఏమిటది?

ఊర్వశి :

కన్నీళ్ళతో, అబలత్వంతో నిన్ను రంజింపచెయ్యడం నాకు చాతకాదనుకోకు. స్త్రీలోవుండే హానిలేని నటనలు, గారవంచెడని చనువులు, వగలు, ప్రణయకోపాలు—ఇవన్నీ నాకు తెలీకకాదు— ఇన్నేళ్ళూ వాటిననుభవించి, అంతకన్న గౌరవమైన, ఉజ్వలమైన ప్రేమకి అర్హుడివైనందు నే, నాన్నీ హోర్వాత కలిగింది నీకు. నిన్ను లాలించడానికి కాదు. నిన్ను కాల్చి, కరిగించి, శుభ్రపరిచి, దేవత్వాన్నియ్యడానికి శపించారు ఎవరో నన్ను.

లోపల్నించి, 'రాజాధిరాజా, మృణాళినీదేవి అస్తమించింది.'

పురూరవుడు :

ఆ...

ఊర్వశివంక చూడకండా వెళ్ళిపోయినాడు. పడమట పొడిచిన శుక్రుడివంక చూస్తోకూచుంది ఊర్వశి. ఐదు నిమిషాలలో తిరిగివొచ్చాడు పురూరవుడు. ఆమెవంక చూడక కటకటాలని ఆనుకుని ఆమె కేసి వీపుతిప్పి రాత్రిలోకి చూస్తోనుంచున్నాడు కన్నీళ్ళతో.

పురూరవుడు :

మృణాళిని, మృణాళిని.

ఊర్వశి :

ఇట్లా రా.

పురూరవుడు:

నిన్ను భరించలేను, వెళ్లు.

ఊర్వశి :

(చాలా దయగా) మేలుకో, ఈ క్షుద్ర దుస్వప్నాలలో ఎందు కిట్లా ఆరాటపడతావు?

నేను వెళ్ళనా?

వెళ్ళవలసిన సమయం వొచ్చినప్పుడు ఒక్క నిమిషం నన్ను ఆపుకో లేవు. నేను వెళ్ళినా, నేను నిన్ను వొదిలితే, ఈనిమిషపు నీ వెర్రి అవివేకానికి రోషించి నేను వెడితే, ఏమై పోతావు నువ్వు? ఎన్నడో అనుభవించి, కోల్పోయి మరిచిన స్వర్గానుభవం వంటి నా జ్ఞాపకంతో జన్మజన్మలు యుగ యుగాలు అశాంతిలో, వేదనలో, పశ్చాత్తాపంలో కాలి పోవా!

పురూరవుడు:

మృణాళినిని నాకియ్యలేవా!

ఊర్వశి :

ఇట్లారా...

దయగా ఆమె అతన్ని తీసుకుని అతని
తలని తొడమీద పెట్టుకుని లాలిస్తోంది.

ఊర్వశి :

మృణాళిని మృత్యువుకి నారాక కారణమని, నామీద నీలో ద్వేషం, నీ కామపరత్వం కారణమని నీకు నీమీదిఅసహ్యం — ఇవన్నీ చాలా అల్పత్వం. అంతకన్న ఏ కొంచెం జ్ఞానంతో జీవితాన్ని చూడగల వివేకమున్నా, స్పష్టమౌతుంది విధి నియమమని.

నేను రాకముందు, మృత్యువు నెరగవా? నేను రాకపోయినా, బాధనీ, మృత్యువునీ, అభ్యంతర పరచగలవా!
వెర్రిరాజా, ప్రియా, మేలుకో.

అంటూనే అతన్ని నిద్రపుచ్చుతోంది.
ఆమె ఆకాశంలోంచి ఏమిటోవింటోంది. పెదిమలు
కదలకండానే ఏదో ప్రత్యుత్తరం ఇస్తోందనిపిస్తుంది.
జాలిగా పురూరవుడివంకచూచి బుజ్జగిస్తుందిఅతన్ని.

పురూరవుడు:

(నిద్రగా) నువ్వెవరో చెప్పు, ఇప్పుడు.

ఊర్వశి:

నీప్రియురాల్ని. చూడు. ప్రశ్నలడగడం మరిచిపో. విశ్వాసం నేర్చుకో. నన్ను నమ్ము.
నేను నీ ప్రియురాల్ని కాక ఇంకేమీ కాదు. నువ్వు నా నాధుడు, నా ప్రభువువి. నువ్వు లేంది నాకు నే ననేదానికి అర్థం లేదు. యుగాలు వెతికి వెతికి చేరాను ఈనాటికి నిన్ను గొప్ప అశాంతితో, యీలోకపు అశాంతి కాదు, వెయ్యి కన్నులతో, ఎక్కడ? ఎక్కడ? అని కాలంతో ప్రతిక్షణం ఎదురు చూసే, సూర్యచంద్రులతో, అనంత దూరాన ఉన్న నక్షత్రాల కాంతితో కళ్ళు కలిపి వెతికే మధురమైన అశాంతితో, మాయపొరలు ఛేదించి అనేకరూపాలలో, లోకాలలో, కాలాలలో, ఎవరు? ఎవరు? నా ఆత్మనాధు డెవరు, అని దిక్కులు నిశ్శబ్దంగా మారుమోగే అన్వేషణ ఫలితంగా కలుసుకున్నాను నిన్ను.

నన్ను మరిచిపోకు. మళ్ళీ నాచేతుల్ని తప్పించుకుని అంధకారంలోకి జారి నానించి దూరమై పోకు. నీ అనుభవానికి నువ్వే విరోధివై, నీకు నువ్వే అబద్ధీకుడవై మనిద్దరి మధ్యా విరహ సముద్రాలని కల్పించకు.

నన్నే నువ్వు నిరాకరిస్తే నేను నిస్సహాయనై పోతాను. ఎంతకూ రానికాంతికై మౌనంగా పువ్వురేకలమీద కన్నీరు కార్చే రాత్రివలె నా విరహంలో నేనే అణిగిపోతాను.

ప్రియా, పురూరవా!

నన్ను నిరాకరించకు.

పురూరవుడు నిద్రపోయినాడు. మిణుగురులు వాళ్ళచుట్టూ ఆడుకుంటున్నాయి. ఎదురుగాఉన్న శుక్రుడు వాళ్ళముందుకివొచ్చి నుంచున్నట్టయింది. పువ్వులు సంతోషంపట్టలేక, పరిమళాన్ని వాళ్ళమీద విరజిమ్ముతున్నాయి. నాలుగునిమిషాల్లో కళ్ళుతెరిచి కూచున్నాడు. అతని మొహాన గొప్పతృప్తి, శాంతి. చుట్టూ వింతగా చూశాడు, కొత్తగా, ఎన్నోఏళ్ల ఎక్కడికో వెళ్ళి వొచ్చి చూస్తున్నవాడివలె.

పురూరవుడు :

నువ్వా! నువ్వా! వున్నావా; ఇక్కడే. మృణాళిని. అవును. స్వప్నం. ఎంతకాలం ఎన్నేళ్ళు, మృణాళినితో. మృణాళిని లేదుకదూ ఈలోకంలో. కాని చాలా నిజమనిపించింది. ఎన్నేళ్లు నిద్రపోయినాను? కాదు, ఇప్పుడేనా? ఆ దినమేనా ఇది!

ఊర్వశి :

ఏమిటి నీస్వప్నం? (చిరునవ్వుతో)

పురూరవుడు :

ఎన్నేళ్ళో మృణాళినీ నేనూ గొప్ప ఆనందాన్ననుభ వించాము. ఎన్ని క్రీడలు; ఎంత ప్రేమ ... నువ్వు గావును, నువ్వేననుకుంటూ వొచ్చావు. మృణాళిని భయపడ్డది. కాని నువ్వు మాదగ్గిరికి రాలేదు. దూరానవున్నావు. నేలమీదో, ఆకాశానో, మబ్బులమధ్యనో, నువ్వు నాట్యంచేస్తున్నావు. నీ నాట్యాన్ని చూస్తో మేము ఐక్యమైనాము. నువ్వు చాలా దూరం. మాకు సంబంధంలేదు. కాని మేము నిన్ను చూస్తున్నాము. నువ్వు ఒకమనిషివనిపించనేలేదు. వెన్నెలా, మెరుపులూ, మబ్బులూ, ఇవి అభ్యంతరమా? అట్లానే. నీనాట్యం ఉధృతమైనకొద్దీ, మా సంయోగం గాఢమయింది. నువ్వు అడుగులు వేస్తోవుంటే, కొత్తనక్షత్రాలు రవ్వలవలె ఎగిరి ఆకాశంలో ఆడుతున్నాయి. కవిత్వాలు, సాహి త్యాలూ, గానవాహినులు, నీవేళ్ళ కొనలనించి ఉద్భవించి మమ్మల్ని రమింపచేస్తున్నాయి. నీ చూపుల్లో కొత్త దేవతామూర్తులు జనించి ప్రపంచాన్ని దీవిస్తున్నారు. నీపాదాలచుట్టూ లోకాలు గిరగిరతిరిగాయి. విరబోసి ఎగిరే నీజుట్టులో భూమండలమే కొత్తమాయల్ని కప్పుకుని విప్పు కుంది. నీదేహం వూపులో జీవనమరణాలు నీ స్తనాలుగా సుడిగుండాలు తిరిగాయి.

ఆగానంలో, ఆవూపులో, ఆమాధుర్యంలో, విషాద నిబి డత్వంలో, మృణాళినీ, నేనూ దేహాలకి సాధ్యంకాని విధంగా ఐక్యమైనాము. నేను ఆమె లోపలికి ఆమె అంతా నావీర్యస్తానమే ఐ, వెముకలుతప్ప, తక్కిన మాంసమూ

నెత్తురూ లేకండా, అస్తులుమాత్రమే అభ్యంతరంగా దగ్గిరిగా ఒకటికావాలని చూస్తామే. అట్లా, ఒకరినొకరం తీసుకున్నాము. ఆమె స్త్రీశక్తిలో నన్ను మింగేశింది. నా పురుషశక్తితో ఆమెని నింపేశాను. అట్లా నీనాట్యంలో నీ నడుంచుట్టూ తిరిగి నీలో ఐక్యమయ్యే సహస్ర సూర్యచంద్రుల వలె, మృణాళిని నాలో నానడుంలో నారోమ్ముల్లో కరిగి పోయింది. నువ్వు మాయమైనావు ఆకాశాంచలాల అట్లా నృత్యంచేస్తో. మృణాళిని నాచేతుల్లోలేదు. కాని ఉంది. నాలోఉంది. కనపడుతోంది. ఇంతలో ఆకాశం పెద్ద శబ్దంతో కాంతితో బద్దలయింది. నువ్వు దిగుతున్నావు భూమికి. నేను మేలుకున్నాను.

ఊర్వశి :

గొప్పకల కన్నావే! ధన్యుడివి.

పురూరవుడు:

(దిగులుగా) కాని కల... ఐతేనేం మృణాళిని లేని దిగులు లేదు నాలో ఇప్పుడు. కాని కల... మృణాళిని లేదు.

ఊర్వశి :

చూడు. నీలోలేని దిగులుని, యామమైన దిగులుని ధర్మముని తెచ్చుకోడానికి చూడకు.

పురూరవుడు:

కాని కల.

ఊర్వశి :

కలకీ జీవితానికీ భేదమేమిటి? మేలుకున్నావు గనక ఆ అనుభవాన్ని కల అంటున్నావు. వాస్తవంకాదని దిగులు

పడుతున్నావు. కాని అట్లానే ఆకలలోనే అంతమైనావనుకో. ఆ కల వాస్తవంకాదని నీకు తెలీదుకద! వెయ్యేళ్లు మృణాళినితో నిజంగా జీవించినా, అదీ ఒకప్పటికి వృత్తజ్ఞాపకం, కలా అయి తీరుతుంది గద!

పురూరవుడు:

ఐతే యీ జీవితమంతా కలేనంటావా?

ఊర్వశి:

నన్నడక్కు ఏమంటానని. మరణంతరవాత ఎక్కడో మేలుకుంటే, ఇది కల అనుకోవా మరి! కలతరవాత మేలుకున్నప్పుడు నిద్రముందు జీవితాన్ని ఎక్కడ వొదిలావో, మేలుకుని ఆకొనని అందుకో గలుగుతున్నావు గనక జీవితం నిజమయింది. నిద్రలో జరిగింది కల, అబద్ధం అయింది. ఎందుకూ? కల జరిగినతరవాతి కొనను అందుకోలేవుగనక. మళ్ళీ యీ జీవితం కొనఅందకండా ఎక్కడో మేలుకున్న రోజున, యీ జీవితం కలకాదా?

పురూరవుడు:

ఔననుకుంటాను.

ఊర్వశి:

అనుకోడం కాదు. అంతే. జీవితమంటే ప్రతి అడుగుకీ కదలిక. కదలికఅంటే, త్యాగం, తోవపొగునా వొదలడం. అందులో ప్రేమ జీవితమంటే చాలా వేగమైన కదలిక. క్షణక్షణానికీ తీవ్రమైన పరిత్యాగం.

తప్పదు. జీవితలక్షణమే అది. ఇక గోలపడకు. వెనక్కి చూడడం చాలా మూర్ఖం, ముందు అనంతకాల దివ్యానుభవాలు పెట్టుకుని.

ఏ విషాదం ఆనందం కలగనీ, అనంతకాల పరంపరలలో ఒక్క ముహూర్తం. అనుకుంటూవుండగా గడిచిపోతాము. నీజీవితంలో మృణాళిని క్షణంలో మాయమయ్యే కాంతిరేఖ. ఆమె జీవితానికి నువ్వూ అంతే. రా.

— ••• —

రాత్రి పన్నెండుగంటలు. చీకటి.

ఊర్వశి చెట్టునానుకుని, ఫౌన్‌టెన్ల ఆటచూస్తోంది. దీపాలకింద, నీటిలో రంగులచేపలు ఆడుకుంటున్నాయి. బైటినించి చాలా దూరంగా కోలాహలం వినపడుతోంది. కాని ఊర్వశి ఏదో వినాలనీ, తెలుసుకోవాలనే ఏకాగ్రతతో చుట్టూ ఆకాశాన్ని వెతుకు తున్నట్టుగా వుంది. కొంచెంసేపట్లో చాలాదూకుడుగా పురూరవుడు వొచ్చాడు. పూర్తిగా సభా తయారులోవున్నాడు. గొప్ప బట్టలూ, కత్తీ. అతన్నిచూసి ఊర్వశి శాంతంగా చిరునవ్వుతో ఆహ్వానించింది.

ఊర్వశి :

చాలా ఆలస్యమయింది.

పురూరవుడు:

వింటున్నావా ఆ కోలాహలం. ఇన్నిగంటలూ, చర్చిస్తున్నారు, ఏమిటో తెలుసా ? నానడవడిని. అంతే నిన్నూ, నిన్ను వంపెయ్యాలిట. నీవల్ల రాజ్యానికే అరిష్టం, [illegible]పద. నావైపు పలికినవారు ఒక్కరులేరు. గురువులు, సామం[illegible]లు, ప్రజలు, సైన్యాధిపతులు చివరికి నాపుత్రులు, [illegible] ఆ కోలాహలం.

ఊర్వశి:

ఏమన్నావు నువ్వు ?

పురూరవుడు:

ఒక్కమాట విననన్నాను. కాని వాళ్ళపద్ధతి ఏం బాగా లేదు. ఏదో రహస్య వ్యాపారప్రయత్నం తెలుస్తోంది నాకు. ముఖ్యం నా ఆప్తుడు, ప్రాణతుల్యుడు, ఆదిత్యుడుకూడా.

ఊర్వశి:

ఏంచేస్తా విప్పుడు?

పురూరవుడు:

నన్ను ఎన్నడూ ప్రశ్నించనివాళ్ళు నాసన్నిహితులుకూడా నా క్షేమంకోసం, నిన్ను పంపెయ్యమంటున్నారు. ఇక్కడ ఇంక నిలవడం దుస్సహమే కాదు, క్షోభాయుతం కాబోతుంది. వెళ్ళిపోదాం. రాజ్యం వాళ్ళకి వప్పచెప్పి వెళ్ళిపోదాం, మన అరణ్యోద్యానవనానికి...ఏమంటావు?

ఊర్వశి:

(సందేహంగా) సరే.

పురూరవుడు:

ఏమిటా సందేహం?

ఊర్వశి :

(నవ్వుతో) నీ మనసులోని సందేహమే.

పురూరవుడు :

నీ కెట్లా తెలిసింది?

ఊర్వశి :

ఐక్యమంటే అర్థమేమిటి?

పురూరవుడు :

అవును. అక్కడైనా మనని శాంతంగా వొదులుతారాఅని.

ఊర్వశి :

అవును. మన విలాసంకోసం మనం వెళ్ళాలిగాని, ఇబ్బందులకి వెరిచి ఎందుకు వెళ్ళడం?

పురూరవుడు:

మరి ఏంచెయ్యను?

ఊర్వశి :

ఆ సమయానికి ఏంచెయ్యాలో, అదే తెలుస్తుంది, ఏం చెయ్యను? అనే ప్రశ్నని నిర్మూలించ గలిగితే!! ఆ ప్రశ్నే యీ ప్రపంచంలో దారుణం. ఇన్ని భయాలకి కారణం, ఏదిచేసీ ఏది చెయ్యకా పోయిందేమీ లేదని గ్రహించరు

బైట పెద్దగోల.

పురూరవుడు:

వింటున్నావా! ఈ సమయాన నా సైన్యంతో వాళ్ళనందరినీ హతమార్చా లనిపిస్తోంది,

ఊర్వశి నవ్వుతోంది.

పురూరవుడు :

ఏమిటి?

ఊర్వశి :

ఎందుకాపని చెయ్యలేదు?

పురూరవుడు :

చేస్తాను.

వెళ్ళ పోతున్నాడు.

ఊర్వశి:

ఉండు. 'చేస్తాను' అని ఆపనిమీద బలం తెచ్చుకోడంలోనే బలహీనం తెలీటంలేదా?

పురూరవుడు:

(ఉలిక్కిపడి)... బలహీనమా? నాకు?

వెళ్ళబోతున్నాడు.

ఊర్వశి:

నీ ధైర్యంలో కాదు, నీ ప్రావీణ్యతలో కాదు. ఆపని నించి నీకు రాగల ఫలితంపైని విశ్వాసంలో బలహీనం. అంటే జ్ఞానం విశాలమయిందన్న మాట నీలో. పూర్వం నీకీ సందేహామే కలిగేది కాదు.

మళ్ళీ చెప్తున్నా, నిన్ను నువ్వు అర్పించుకో.

పురూరవుడు:

ఎవరికి? నీకేనా?

ఊర్వశి:

నాకు కాదు. నాపైని నీ ప్రేమకి.

అర్థం కావటం లేదు నీకు.

మళ్ళీ ఇంకోసారి, ఇదే కడపటి సారేమో. నీకు చెపుతున్నాను. ప్రేమకి నిన్ను, నీ ఐశ్వర్యాన్ని అర్పించడం కాదు, నీ స్వేచ్ఛని, నీ బైట స్వేచ్ఛని కాదు, నీ ఆత్మ స్వేచ్ఛని, నీ కోపాల్ని, ధర్మాల్ని, ఇష్టాల్ని, కర్తవ్యాన్ని అర్పించు.

పురూరవుడు:

ఇంక నాకు తెలీదు.

ఊర్వశి:

తెలుస్తుందిలే, తొందరేం! ప్రస్తుతం నా నిర్దేశమేమిటంటే... అవన్నీ తీసేసి, నిర్విచారంగా నా చేతుల్లోకి రా. కాలం వృథా చెయ్యకు. శృంగారం ఎంత అమూల్యమను కున్నావు?

పురూరవుడు:

వాళ్లు?

ఊర్వశి:

వాళ్ళు ఉత్తశబ్దం.

ప్రేమలో లెఖ్ఖలులేవు. యోచనలులేవు. జీవితం ఏమైపోనీ నష్టాలేరానీ, సమస్తమూ కూలిపోనీ, ప్రేమజీవితం. విధివలె, కాలప్రవాహం కన్న బలంగా తీసుకుపోతుంది, తన ఆరాధకుల్ని.

మాట్లాడుతో అతని సభాపరికరాల్ని విప్పి కిందపడేస్తుంది.

ఈ గాలిలోంచి ఆకాశంలోంచి ఏవో ఆదేశాలు దూరంగా వినపడుతున్నాయి నాకు. ఇంక నీకూ నాకూ ఎక్కువ వ్యవధి లేదనుకుంటాను.

పురూరవుడు:

(అదిరిపడి) అంటే...

ఊర్వశి:

వెళ్ళిపోవాలి.

పురూరవుడు:

(ఆమెమాటని వేరుగా అర్థంచేసుకుంటో) అవును, వెళ్ళిపోదాం.

ఊర్వశి:

నీమీాద నాకు అనంతకాలపు ఆదినించి ప్రేమ. ఎందుకో, ఎట్లానో, నాకు తెలీదు. నువ్వూ, నేనూ, అనే గీతం తప్ప ఇంకేం వినపడదు. ఈ సృష్టి లీలాతరంగాలమీాద, మనిద్దరి ప్రేమనాట్యమే కనిపిస్తుంది నాకు. రా.

అతన్ని పక్కనున్న చెట్టుకిందకి తీసుకు వెడుతోంది.

ఆ చెట్టుకింద విశాలమైనఅరుగు. ఆ అరుగుమీద పట్టుదిళ్లు.

కూచో. నేను అనేది తప్ప నీమనసునించి అన్నీ దూరం చేసుకో. చూడు ఈ అందమంతా నేను. సమస్తమూ నేను నీకు, నమ్ము నామాట. రా.

చాలాసేపు నిశ్శబ్దం. వాళ్ళిద్దరూ ఆ చెట్టునీడ చీకట్లో ఉన్నారు. బైట కోలాహలం అణిగిపోయింది. ప్రపంచం చీకట్లో శాంతం వహించింది. ఫౌన్టెన్లు కాంతిలో మెరుస్తున్నాయి. నీటిలో నక్షత్రాలు వూగుతున్నాయి. మెల్లిగా చప్పుడులేకండా పువ్వులురాలుతున్నాయి.

వాళ్ళిద్దరూ మేలుకుని వున్నట్టు గాఢత్వంలో
మార్పులుచెందేవాళ్ళ నిశ్వాసాలు తెలుపుతున్నాయి.

కాలం జరిగింది.

ఆకాశంలో జరిగి వాళ్ళ వంక చూసే సప్తరుషి మండలం
వెలుగులో పురూరవుడూ ఊర్వశీ కనిపిస్తున్నారు కొంచెంగా!

ఇద్దరికీ బట్టలులేవు. ఇద్దరూ అలసిపోయినారు. ఎన్నడూ అలుపునెరగలేని ఊర్వశికూడా గొప్ప ఆత్మయత్నం వల్ల అలిసి సొమ్మసిలినట్టయింది. పురూరవుడు ఊర్వశినిగట్టిగా ఆమెదేహంకనపడకండా చేతుల్లోఇముడ్చుకుని చాలా తగ్గిన కంఠరవంతో రహస్యంలాగు మాట్లాడుతున్నాడు.

పురూరవుడు:

నిన్నటికల నిజంగా మెళుకువలో జరిగింది ఇవాళ. నీకు తెలిసిందా? నువ్వోరుగుదువా?

ఊర్వశి :

అవును.

పురూరవుడు:

ఈస్థితినే యోగులు వర్ణించారు. నువ్వూ నేను అనే భేధమే పోయిన ఆనిమిషాన, నాలోపలి అగాధాన్ని అందుకుని ఆక్రమించుకుని, ఐక్యం కావాలనే ఆ రత్యాధృతంలో, రక్తమంతా తలకెక్కింది, నా శరీరమంతా, నన్ను వొణికించే విద్యుల్లతలు పరిగెత్తాయి. మాట ఆగిపోయింది.. నాలుక నా స్వాధీనం తప్పింది, నీతో చెప్పుదామంటే, నీకు తెలిసిందా!

ఊర్వశి :

ఊఁ.

పురూరవుడు:

మన చుట్టూవున్న యీ చీకటి భగ్గుమని వెయ్యి దయగల సూర్యులతో వెలిగింది. ఆ మెత్తని కాంతిలో, యీ అవకాశం లేదు, మనచుట్టూ యీ స్థలం దిక్కులువిచ్చి దూరమైనట్టు విప్పుకుంది, మాయమయింది. ఏమీలేని యీ స్థలం దూరం కావడం అంటే ఆకాశం కనపడకండా వెళ్ళిపోతోందనుకో మన కళ్ళముందు— ఆవిశాలత్వం...

ఊర్వశి :

నీ ఆత్మలో ఆ విశాలత్వం...

పురూరవుడు:

ఏం ఆనందం!! దాంటో నువ్వూ, నేను యీవనం, ఏవీలేవు, ఎవరూలేరు.

ఊర్వశి :

మన దేహాలు లేవు. మనంవున్నాం. కాదు. మనంలేము. వుత్త ఆనందమే వుంది.

పురూరవుడు:

మనం కాదు. నువ్వూ కాదు. నేను కాదు. నువ్వూ ఔను. నేనూ ఔను. భేదం లేని నువ్వూ నేనూ, ఐక్యమైన మనం...

ఊర్వశి :

ఔను.

పురూరవుడు:

ఒక్క క్షణమో, యుగమో, కాలపరిమితిలేదు అ అనుభవానికి. అంతే అయిపోయింది. మళ్ళీ ఈ లోకంలోకి... నీ చేతుల్లోకి, నీమీదికి... నీకళ్ళ వెలుగులోకి...

ఊర్వశి :

దిగులా...

పురూరవుడు:

అవును.

ఊర్వశి :

మరి నేను లేనుకద అప్పుడు.

పురూరవుడు:

ఉన్నావు, నాలో నువ్వు నీలో నేను.

ఊర్వశి :

ఇప్పుడో!

పురూరవుడు:

కాని ఆ ఐక్యం... ...నిద్రవొస్తోంది చాలా మధురంగా.

ఊర్వశి :

పడుకో.

పురూరవుడు :

(నిద్రగా) నువ్వెవరు ? చెప్పనా ?

ఊర్వశి:

చెపుతాను.

పురూరవుడు:

ఎప్పుడు!

ఊర్వశి:

త్వరలో నే:

పురూరవుడు :

ఎప్పుడు?

ఊర్వశి:

తెల్లారే లోపల.

పురూరవుడు :

నిజమా?

ఊర్వశి :

(పరధ్యానంగా] ఊ.

పురూరవుడు :

నిద్రా?

ఊర్వశి :

నాకు నిద్రేమిటి?

పురూరవుడు :

నాకు నిద్రవొస్తోంది. దగ్గిరికి తీసుకో.

కలని మరిచిపోలేక నిద్రగా మాట్లాడుతున్నాడు.

ఏమనుభవించాననీ! మాధుర్యం, శృంగారం, ఆనందం, నీ శరీరంనించి, విడిపడి, ఏసహాయము లేకండా, వాటి నిజ

స్వరూపంతో నాలో నాట్యమాడి, సముద్రపు అలలవలె ముంచేశాయి. నువ్వు నా చేతుల్లో లేవు. నేను ఈ శరీరానికి కట్టుబడలేదు. నువ్వూ నేనూ యీభూమీ ఆకాశంవలె సమస్తాన్ని ఆక్రమించి కలుసుకొని అనుభవించినట్టుయింది. చుట్టూ గొప్పకాంతి. కాంతి కాదు మళ్ళీ. కాంతిలోనించి మనకి వచ్చే అనుభవం. చాలా మెరుగు పెట్టిన అనుభవం.

పక్కన చెట్ల ఆకులమీద ఎవరో నడుస్తున్న చప్పుడు. ఊర్వశి చాలా మెళకువగా వింటోంది. పురూరవుడు నిద్రతో తూగుతున్నాడు.

పురూరవుడు :

ఎవరు!

ఊర్వశి :

ఎవరైతేనేం! నిద్రపో.

పురూరవుడు :

ఎవరది!

ఊర్వశి :

ఎవరో పోనిద్దూ.

పురూరవుడు :

ఎవరో చూడనీ; వొదులు.

ఊర్వశి:

(అతన్ని దగ్గిరగా తీసుకుంటూ) ఎవరైతేనేం చూడకు.

పురూరవుడు:

అట్లాకాదు. వాళ్ళు ద్రోహం తలిచారు.

ఊర్వశి :

ఊం.

పురూరవుడు:

ఈరాత్రికే.

ఊర్వశి :

ఐతేనేం?

పురూరవుడు :

అపాయం.

ఊర్వశి :

కానీ.

పురూరవుడు:

నిరాయుధులం. వీల్లేదు. నన్ను వెళ్ళనీ.

ఊర్వశి :

వొద్దు. నన్ను వదలకు.

నిశ్శబ్దం. ఎవరో చీకట్లో దగ్గిరగా వొస్తున్నారు- పురూరవుడు చూశాడు.

పురూరవుడు:

ఆ, ద్రోహీ.

ఊర్వశి :

ఏం లేదు.

పురూరవుడు:

వుండు.

అని తీవ్రంగా ఆమెను తోసేసి, ఒక్క-దూకులో తన కత్తిని అందుకున్నాడు.

ఊర్వశి :

నువ్వు కదల వొద్దు. నా ఆజ్ఞ.

(లేస్తో) పురూరవా, ఆగు. వెళ్ళకు. నాఆజ్ఞ...

పురూరవుడు వాళ్ళ మీద పడ్డాడు.

చీకటో కొత్తకంఠం వేదనతో :

మహారాజా...... మీాపైని కాదు. ఆపిశాచిని అంత మొందించాలని.

పురూరవుడు:

నువ్వా!!! ఎవరైతేనేం! అనుభవించు.

పురూరవుడు తిరిగి వొచ్చేటప్పటికి చెట్టుకింద పెద్ద వెలుతురు. ఊర్వశి దేదీప్యమానంగా వెలుగుతోనుంచునివుంది. ఆమెపాదాలు భూమిని తాకటంలేదు. ఆమె కళ్ళలోంచి గొప్ప వెలుగు ఆమె దేహమంతా మిరుమిట్లు గొలిపే కాంతి. ఆమె కళ్ళలో గొప్పజ్ఞానంతోకూడిన దయాదృష్టి.

పురూరవుడు నెత్తురుకారే కత్తిని కింద పారేసి ఆమెముందు ఆరాధనతో మోకరించాడు.

ఊర్వశి :

పురూరవా! నేను వెడుతున్నాను.

పురూరవుడు :

అపరాధిని.

ఊర్వశి :

అవును. నాశాపం గడువు తీరింది. నాకన్న నాఆజ్ఞకన్న నీప్రతాపం అధికమయింది నీలో.

పురూరవుడు :

అపరాధిని. క్షమించు... ...

ఊర్వశి :

నేను వెడుతున్నాను.

ఆమె మెల్లిగా భూమికి దూరమౌతోంది.

పురూరవుడు :

వెడుతున్నావా? నానించి? ఏపరిహారం? ఏశిక్ష?

ఊర్వశి :

ఏమీలేదు... గొప్ప పరీక్ష జరిగింది నీజీవితంలో.

పురూరవుడు:

మరి వాళ్ళు నిన్ను చంపేసేవాళ్ళు... ...

ఊర్వశి :

నన్నా! నన్ను చంపలేరు. నాకడ్డపడ్డ నిన్ను చంపేవాళ్ళు... ప్రియా,... విను. నేను ఊర్వశిని. దేవవేశ్యని... ...

పురూరవుడు:

ఊర్వశివా! ఇన్నాళ్ళు దాచావా?

ఊర్వశి :

ఇన్నాళ్ళు నాకు తెలీదు. విను. నిన్నూ చంపివుంటే, యీ దేహభారాన్ని వొదిలి, నాలో దేవలోకానికి వొచ్చేవాడివి. కాని నీ మనసు ప్రోత్సాహం నిన్ను జయించింది. పాపం, గొప్ప విరహంలో అనేక సంవత్సరాలు మధనపడాలినువ్వు, మరణం వరకు.

పురూరవుడు:

అదెంత సేపు, నేనూ వొస్తున్నాను.

కత్తి తీశాడు.

ఊర్వశి :

లాభంలేదు. నీసహజ మరణ సమయం వరకు ఎట్లానూ అందను నేను నీకు.

పురూరవుడు:

నన్నువిడిచి వెడుతున్నావా? ఇదంతా మాయా! నీ ప్రేమ మాయా?.

ఊర్వశి :

ఈ సృష్టి, ఈశ్వరుడు, ఎంతవాస్తవమో నా ప్రేమా అంత వాస్తవం.

పురూరవుడు:

మరి నన్ను ఎట్లా వొదలగలవు?

ఊర్వశి :

నాశక్తిలో లేదు నీతో వుండడం.

పురూరవుడు:

ఎవరు మనవిరోధులు? చెప్పు. ముల్లోకాల్లో ఎవరైనా...

ఊర్వశి :

ముల్లోకాలు వెతికినా దొరకనిశక్తి... ఈ జీవిత విధాతకి, విధాతకి అందనిశక్తి.

దిగులుపడకు... ఆకల్పాంతం నీకోసం కాచుకుని వుంటాను.

ఇంకా దూరమైపోతోంది.

పురూరవుడు :

ఊర్వశీ, ప్రేయసీ, పోనీను నిన్ను.

ఆమెమీదికి దూకాడు. ఆమె తొడలవరకు అందింది అత
నికి. కాని అతనిచేతులకి ఏమీచిక్కలేదు కాంతి తప్ప.

ఊర్వశి :

(వొంగి అతని తలమీద చెయ్యేసి) జీవితం ఒక్కక్షణం. మన ప్రేమానుబంధం అనంతం. నా విరహం పొందినకొద్దీ క్రమంగా, నేను ఇంకా గొప్ప శృంగారంతో జ్ఞానంతో, నీ హృదయంలో వ్యాపిస్తాను. దిగులు పడకు.

పురూరవుడు :

ఎంత నిర్భాగ్యుణ్ణి—

ఇంకా దూరమౌతో కరగిపోతోంది.

ఊర్వశి :

నిన్ను నువ్వు నిందించుకోకు. ఇట్లా జరగాలి. అంతే.

పురూరవుడు :

నువ్వు వుత్త కల ఐపోతావు. నీతో అనుభవం ఒక్కక్షణమై పోతుంది. మళ్ళీ ఈమాయలో పడతాను.

ఊర్వశి :

భయపడకు, నావాడివి. నువ్వేం చెయ్యి, ఏ సుఖదుఃఖ భ్రాంతుల్లోనైనా నిన్ను విడవను. నా ప్రియుడివి నువ్వు. నేనే నువ్వు.

మాయమయింది. పురూరవుడు 'ఊర్వశీ' అని పెద్ద కేకవేసి పడిపోయినాడు.

— ... —

# ఏళ్ళు గడిచాయి

పురూరవుడు రాజ్యాన్ని పుత్రుడికి వప్పచెప్పి, ఊర్వశీ విరహంలో ఒక్కడూ తన అరణ్య ఉద్యానవనంలో గడిపాడు. విరహాన్ని భరించలేక, ఇంద్రుణ్ణి మెప్పించి ఊర్వశిని పొందాలని గొప్పయజ్ఞాలుచేసి దేవతల్ని తృప్తుల్నిచేశాడు. కాని ఊర్వశిలభించలేదు. కాని చివరకి ఒకనాటిరాత్రి:

పురూరవుడి హర్మ్యంలో పైన చిటారుగది. కిటికీలన్నీ తీసివున్నాయి. ప్రతిరాత్రిమల్లేనే చీకట్లో ఆకాశంలోకి ఊర్వశి కోసం చూపిచూపి అలిసి పక్కమీద కళ్లు మూసుకున్నాడు పురూరవుడు.

గదిఅంతా గొప్ప కాంతితో నిండింది. తను కళ్లు తెరిచేప్పటికి పక్కకి కొంచెం దూరంగా ఊర్వశి నిలబడివుంది, ఆ చివరి రాత్రి మల్లేనే దేదీప్యమానంగా వెలుగుతో, జాలిగా అతని వంక చూస్తో.

ఊర్వశీ అని కేకవేసి లేస్తున్నాడు పురూరవుడు.

ఊర్వశి :

కూచో. లేవకు. లాభంలేదు. నీ చేతులకి అందను నేను.

పురూరవుడు:

(వినిపించుకోక) అందవా? అందవా ?

అని ఆమెని ఒకచే కావిలించుకున్నాడు. దగ్గిరికి తీసుకున్నాడు. జుట్టునీ, చంపల్నీ, వక్షన్నీతాకాడు. కాని ఏమీ తగలలేదు అతనిచేతులకి. నిరాశపడి సిగ్గుపడినుంచున్నాడు.

ఊర్వశి :

కూచో, నీ యజ్ఞాలకి, ఆరాధనకి, నిలవలేక, నీకు కనపడమని ఆదేశించారు నన్ను. వొచ్చాను.

పురూరవుడు:

ఊర్వశీ, నన్ను మరిచిపోయినావా? వాళ్ళు బలవంతం చెయ్యగా వొచ్చావా?

ఊర్వశి :

అవును.

పురూరవుడు:

ఎందుకు అంతనిర్దయ? నీకోసం ఇన్నేళ్లు అహోరాత్రాలు అన్వేషించే నాపైని...

ఊర్వశి :

అన్వేషించవా మరి? యుగాలనించి మనం పరస్పరాన్వేష ణంతో గడిపాము.

పురూరవుడు:

ఈనాడు?

ఊర్వశి :

నీమీాది దయవల్ల రాలేదు. రాను. ఎందుకు ఇంత రాద్ధాంతం చేసి నన్ను పిలుస్తావు?

పురూరవుడు :

కాని నువ్వు కనపడక! నువ్వు వాస్తవమా అని సందే హించి...

ఊర్వశి :

ఇప్పుడు నేను వాస్తవమా నీకు!

పురూరవుడు:

కాదా?

ఊర్వశి :

కనపడకపోతే వాస్తవం తప్పుతుందా? ఇది నారూపమా? నీ కోసం తెచ్చుకున్నది.

పురూరవుడు:

మరి నీరూపం చూపవా?

ఊర్వశి :

నీకళ్ళు భరించగలవా?

పురూరవుడు :

మరణం తరవాత చూడగలనా నిన్ను?

ఊర్వశి:

అప్పుడు ఈ నేత్రాలతో చూడనక్కర లేదు.

పురూరవుడు:

ఈశరీరం లేకండా మనకి అనుభవం ఏమి వుంటుంది? ఏ తపస్సుచేతా, నిన్ను మళ్ళీ పూర్వంవలె తెచ్చుకోలేనా?

ఊర్వశి :

గతానుభవాన్ని తిరిగి తెచ్చుకుంటే, ఏరసమూ, పలకదని తెలీదా? ప్రతినిముషమూ ఎదిగి మారే మనసులకి.

పురూరవుడు:

ఇంతకాలం నన్ను విడిచింతరువాత ఏంచేస్తున్నావు?

ఊర్వశి :

ఏమీ చెయ్యటంలేదు. నీకై నిరీక్షిస్తున్నాను. చెయ్యాడ మనేది లేదు ఆలోకంలో

పురూరవుడు:

(బాధతో అడగలేక) మరి నీవు దేవవేశ్యవు. యజ్ఞపరులకు

పుణ్యాత్ములకు, యింద్రలోక వాసులకు నిరతి సుఖం లభిస్తుం దంటారు. నువ్వు నీవృత్తివల్ల, విధికి లోబడి ప్రతి ఆలింగ నానికి సిద్ధం కావలసిందేకద! నిజంకాదా!

ఊర్వశి :

అవును.

నవ్వుతోంది.

పురూరవుడు:

మరి నాకోసం నిరీక్షించడ మేమిటి?

ఊర్వశి :

పిచ్చివాడా! ఊర్వశి అంటే ఏమిటి? మీలోకం మల్లే యోచించకు. ఊర్వశి అంటే ఒక అనుభవం. శరీరంకాదు. శరీరమైనా ఒక అనుభవమే కదా!

పురూరవుడు:

మరి యింక ఊర్వశి పురూరవుడి ప్రేయసి అనడంలో అర్థ మేముంది?

ఊర్వశి:

పురూరవుడు తన పుణ్య ఫలితంగా ఊర్వశీ అనుభవానికి అర్హుడౌతున్నా డన్నమాట.

పురూరవుడు:

మరి వాళ్ళందరూ అనుభ విస్తున్నారన్న మాటకూడా నాకు మల్లేనే...

ఊర్వశి :

పాపం, ఎంత తపన పడుతున్నావు? ఎట్లా అర్థం చెయ్యను నీకు... ఊర్వశి నీ ప్రేయసి అయిందన్నవరం, ఇతరులకు కూడ

ఆ అనుభవం వున్నదనే బాధలో ఎంత న్యూనతని పొందింది నీమనసులో! వెన్నెల అందరి సొత్తు కావడంవల్ల, వెన్నెల లోని ఆహ్లాదం తగ్గిందానీకు!

పురూరవుడు :

కానీ నువ్వు, నీ వక్షం, నీకళ్ళకాంతి, నీ... ...

ఊర్వశి :

అవునోయ్! అన్నీ నీవే. అవి వాళ్ళకిలేవు, వాటిఅనుభవంతప్ప. నిన్నుచూస్తే ఎంత ప్రేమా జాలి వస్తున్నా యంటావు? నాకు చేతనై తే దేహాన్ని ధరించి, నిన్ను కౌగలించుకుని, నీ తలని నావక్షానికి అదుముకుని ఓదార్చా లనిపిస్తోంది.

పురూరవుడు:

ఒక్కగంట రాలేవా?

ఊర్వశి :

ప్రయోజనము లేదు, నాశక్తిలోనూ లేదు. నేను వెడు తున్నాను.

పురూరవుడు:

వుండు, వెళ్ళకు. నన్ను తలుచుకుంటావా ఆలోకంలో?

ఊర్వశి :

ఏరాత్రి నీ స్వప్నాలలో ఊర్వశి కనించకుండా వుంది?

పురూరవుడు :

స్వప్నంలో, మేలుకొని నాదౌర్భాగ్యానికై కాలిపోవడానికే కద!

ఇప్పుడు తలుచుకుంటే నిన్నొక్క క్షణమైనా అనుభవించి నట్టులేదు, అన్నియేళ్ళు నీలో గడిపాననే జ్ఞాపకంతప్ప.

ఊర్వశి:

అంతే ఈలోకంలో అనుభవం.

పురూరవుడు :

నన్ను తీసుకుపో నీతో. నీవులేక ఎందుకు నేనిక్కడ?

ఊర్వశి :

ఎదగడానికి.

పురూరవుడు:

ఎందుకు?

ఊర్వశి :

నన్నాలోకంలో అనుభవించుటకు యోగ్యత గలగటానికి.

పురూరవుడు:

ఇంత ఖేదంలోనా? నీ చేతుల్లో నే నెందుకు పునీతుణ్ణి కాకూడదూ?

ఊర్వశి :

ఏం కాగలిగావు అన్ని సంవత్సరాలు నాతో అనుభవించి? నేనెంత బతిమాలి బోధించాను? తీవ్రమయిన, ఖేదమైన, అగ్ని తుల్యమైన విషాదం లోంచి తప్ప నేర్చుకో లేదు మానవుడు. అందువల్లనే మీలో అంత వియోగం, అశాంతి, బాధ,

పురూరవుడు:

ఎందుకు అట్లా?

ఊర్వశి :

నన్నడక్కు. నాకు తెలీదు.

పురూరవుడు:

ఊర్వశీ, ఊర్వశీ, ఎట్లా భరించను? నీవు వెళ్ళిపోయిన నిముషాన్ని? ఏం చెయ్య నిక్కడ?

ఊర్వశి :

ఏంచేస్తున్నావు ఇన్నేళ్ళూ!

పురూరవుడు:

వెతుకుతున్నాను నీకోసం.

ఊర్వశి :

నేను ముందు అసలు కన్పడక పూర్వం-

పురూరవుడు:

ఏంచేస్తున్నాను? ఇప్పుడు తలచుకుంటే, అప్పుడు బతికానా అసలు అనిపిస్తుంది. అప్పుడు తెలియకుండానే నీదర్శనం కోసం కాచుకుని వున్నానుగావును అనుకుంటాను.

ఊర్వశి:

పోనీ, నా జ్ఞాపకాన్ని తీసెయ్యనా? పూర్వంవలె సుఖంగా జీవింతువుగాని.

పురూరవుడు:

నీ జ్ఞాపకంకూడా లేకండానా? వొద్దు. ఇట్లానే ఆశతో, నీ విరహంతో కాలనీ.

ఊర్వశి:

చూశావా మరి! ఈ వియోగం, బాధ ఎందుకని ఏడుస్తావు గాని, వాటివల్లకలిగే అశాంతే లేకపోతే ఏం అందుకో గలరు మీరు? అన్నీ సహించు. విధిని ప్రార్థించు. దిక్కులదిరేట్టు, 'ఊర్వశీ' అని ప్రశ్నలడుగు. సాధించు. నీకోసమే కాచుకుని వుంటాను: నేను చాలాసత్యం, నీదాన్ని. నీజీవితం ఒక్కక్షణం. ఊర్వశితో అనుభవం అనంతం.

పురూరవుడు:

ఏం చేద్దాం ఆ లోకంలో?

ఊర్వశి :

మన కలలన్నీ సార్థకం చేసుకుందాము. ఆ ఆనందాలు మాట్లాడితే నీకు అర్థమున్నా కావు. నీవు అనుభవించేశృంగారం, పిపీలికకి ఎంత అర్థమౌతుందో, ఆ లోకపు అనుభవం అంతమాత్ర మన్నా తెలుసుకో లేవు నువ్వు! రంగులు, దృశ్యాలు, కాంతులు, లోకాలు, శ్రావ్యగానమాధుర్యాలు, పరిమళాలు, అనంతమైన దివ్యశృంగారం, నిద్రలేని, అలసట లేని, తృప్తిలేని, అశాంతిలేని రతివిలాసాలు ... సౌందర్యాలు —అన్నీ నాలో. దిగులుపడకు.

పురూరవుడు :

విరహవేదన అంతా నాదేగాని, నన్ను చూసి నీ పూర్వపు నిలవలేని ప్రేమ స్ఫురించటం లేదా నీకు! నన్ను విడిచి ఎట్లా నిలవగలుగు తున్నావు!

ఊర్వశి :

నిలవ గలుగుతున్నాను గనకనే, నా ప్రేమ గొప్పది. విరహ బాధలేని ప్రేమ అర్థంకాదుకదూ నీకు?

పురూరవుడు :

మరి నాతో వున్నప్పుడు నాకోసం నువ్వు—

ఊర్వశి :

శాపం వల్ల మనుష్యత్వం వొచ్చింది గనక.

పురూరవుడు :

మరి ఆ లోకంలో నువ్వు నానించి ఇంతదూరంగా, ఉన్నతంగా వుంటే నాకేం సంతోషం.

ఊర్వశి :

అందుకునే ఈనాటి నీబాధ, ఆ లోకంలో నా ఔన్నత్యం,

నా విజ్ఞానం నీకు దూరంగానూ విడిగానూ తోచకండా వుండడానికే.

పురూరవుడు:

ఆనాటికి నా చిన్నపాపానికీ-ఇంత దీర్ఘ తీవ్రపరిహారమా?

ఊర్వశి:

పాపముకాదు. పొరబాటూ కాదు. తప్పదు, నీ జీవితానుభవానికి అంతే పర్యవసానం. నువ్వు ఎట్లానూ దానినించి తప్పించుకోలేవు. నన్ను పొందగలిగిన ఔన్నత్యం ఎట్లాగో తెచ్చుకున్నావు కొంత కాలం. అంత ఔన్నత్యాన్నీ మామూలుగా నీ స్వభావానికి తెచ్చుకోగలగాలి నువ్వు. దానికోసమే యిన్నియేళ్ళ దారుణ తపనం నమ్ము. శిక్ష అనేది, సృష్టిలో లేదు—దయ తప్ప—ఇంక వెడతాను.

పురూరవుడు:

వెడతావా? ఇంతేనా? మన స్నేహం కాలంగానన్నా జ్ఞప్తికి రాదా నీకు? ఎంత దూరమైనావు? ఆ లోకంలో ఇంతేనా? ఇట్లా నువ్వెందుకూ నాకూ?

ఊర్వశి:

(నవ్వి) దయగా నాకు లేదనుకో. సన్నిహితంగా రాలేననుకోకు. కాని నేను నీకు దగ్గరైనానా, నన్ను పొందలేవు. నేను వెళ్ళాక నీ బాధని భరించలేవు. నీతో కలిసి సుఖించిన ఊర్వశినే తలుచుకో, నన్నందుకో గలిగేవరకు. నేను వెడతాను—

పురూరవుడు ఆమెమీద పడ్డాడు. ఆమెకాంతి అతని చుట్టూ ఆవరించి, నిలిచి, చలించి, మాయమయింది.

— ••• —